సోఽహం

గురుచరణం

# శ్రీ సోహామృతసారము

(వేదాంత గేయ గ్రంథము)






గ్రంథకర్త

... అవధూత నిర్మలానంద స్వాముల వారు

పోస్టు: ...కపల్లి, తాలుకా, జిల్లా: నిజామాబాదు, పిన్ నం. 503 230.

శ్రీ ప్రభవనామ సంవత్సర మాఘ పౌర్ణిమా
గురుపూజ మహోత్సవ సందర్భమున



ప్రథమ ముద్రణ : 1979.

ద్వితీయ ముద్రణ : 1, ఫిబ్రవరి, 1988

ప్రతులు . 2000





వెల రూ. 10-00

శ్రీలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, 1-4-920, బాకారం, హైదరాబాద్-48.



# ఉపోద్ఘాతము

సోఽహం

గురుచరణం

పరమ పవిత్రులైన నా ప్రియ సోదరీ సోదరులారా!

మూఢావస్థలోనున్న మానవుని మానసిక స్థితిని, మూఢావస్థ దాటుటకై మానవుడు చేయవలసిన కర్తవ్యమును, ఆధ్యాత్మిక పథమును మరియు దాని ఫలితమును గురించి నే చెప్పబోవు ఈ మాటలు వినుము.

ఒక ఘోర కాంతారమున నొక మర్కటము వసించుచుండెను. దానికొక నారికేళ ఫలము లభించెను. దానిపై పొరలుతీయు విధానము తెలియజాలక నా మర్కటము పలు వెతల బడుచు తుదకు దానిని భక్షించుయుక్తి, జ్ఞానము లేక విసిరి వేసెను. అదే విధముగా మన హృదయ క్షేత్రమున మూఢమతియనే మర్కటము ఆధ్యాత్మిక జీవనము గడుపజాలక మాయ యను పొరను తీయ భక్తి, జ్ఞాన, వైరాగ్య, అభ్యాస, విశ్వాసములనే ఉపాయము తెలియజాలక బ్రహ్మానందమనే జలమును గ్రోలజాలక, జీవన్ముక్తియనే ఫలమును భక్షించజాలక తుదకు జముని హస్తంబులలో కాలపాశమునకు కట్టుబడుచున్నాడు.

కాసారము శుష్కించినచో దానిలో నుండు జలచరములు విలవిల గొట్టు కొని హతమొందును. అదే విధముగా హృదయమనే కాసారమున కామమనే మీనము, క్రోధమనే మకరము, లోభమనే తిమంగలము, మోహమనే జలతురగము మదమాత్సర్యములనే కప్ప, నిడుపడు మొదలగునవెన్నియో నివసించి మనను ఒక అంధకార కాననములో బడవేయును. ఆ అంధకార కాననమున ఈర్ష్యయనే జంబుకము, ద్వేషమనే చీలి, దంబమనే కోటడు, దర్పమనే సాళ్వము, అహంకారమనే ఏకలము, వీటన్నిటికి రాజై షడ్వర్గధ్వజుని తేజిపై మాయ మాత విల్లునమ్ములను బూని మననధోపాతాళమను శోకసాగరమున బడవేసి తుదకు జముని కాల

పాశమునకు గురిచేయుచున్నవి. జీవుడపుడు చేమోడ్చి తనకు బదులుగా తన ధారాపుత్రాదుల నిత్తునన్నను, విత్తము నిత్తునని యాశపెట్టినను వినక తన ధర్మము నెరవేర్చు నిమిత్తము యముడు ప్రాణములను గొనిపోవును. ఇది వేదాంత రీత్యా సిద్ధమని సకల గ్రంథములు బోధజేయుచుండెను. కావున యొకతూరి మీరు ఆత్మానాత్మ విచారమనే జ్ఞాన [illegible] ఖడ్గము బూని తేటియైన గురుదేవుని కరుణకు పాత్రుడవై మది కొలంకు పులుంగుపై తారక మంత్రమను తేరుపై యెక్కి వాటిని తరిమి గమ్యస్థానమైన పరమాత్మ యందైక్యము కావడానికి సదా ప్రయత్నించి మోక్షబిలమును అన్వేషించవలసిన అవసరమెంతోయున్నది. కావున మీరు సర్వదాకృషి జేయగలరు.

అతినీచాతి నీచమైన ఇరుపక్కియందున వున్నదుత్తరమైన తుటమును చిట్టవలెకురంగట రానీయక మిగడించి నెమ్మిచే తాలిమి వహించి అనయము కడగండ్ల నుండి దప్పించుకొనుటకు గ్రిన్నన ప్రయత్నించవలెను.

మూఢుడు గాదిలి వాక్యములు దెల్పినను ఉలడు బెడిసిన పిదప కొంచలము నొందును. ఆధ్యాత్మిక తెనువెంట నడువడు. బ్రహ్మవిద్య కలచే విధానము దెలియడు. మాయయను కసటుచే కప్పబడి కామక్రోధాదుల మోహరమున కట్టుబడి చీకువాలుతో పల్లలపులు వినుచు బలుకుచుండును. అక్కటికము మరచి కన్నుతో యితరులకు అల కల్గించుచుండును. కాని ఉవ్వెత్తుగ మంతనంబున ఆలోచించుకొన్నచో యివి యన్నియు పెద్ద నిద్దురనొందు వేళ వ్యర్థములేయని తెలిపోవును. ఎత్తికోలుచే బ్రహ్మవిద్యవిన్ననువు సంపాదించి అష్ట మదముల మొనను వ్రక్కలించి జన్మసార్థక మొనరించుకొన్ననాడు మనకు ఈ ప్రపంచమున కడమ గొడవ యేమి వుండదు. గురుదేవుని కరుణ బడిసినచో ఎదయందున ఎద మాయమవుటే తార్కాణము.

ఓం శాంతి ! శాంతి ! శాంతిః

ఇట్లు

తమ చరాచర సుఖాభిలాషి

**అవధూత నిర్మలానంద స్వామి**

# : విన్నపము :

పరిశుద్ధాత్మ స్వరూపులగు నా ప్రియ సోదరీ సోదరులారా!

మాయా కార్యమగు ఈ చరాచర సృష్టిలో అనాదిగా మహర్షులచే అనుష్ఠింపబడి పరంపరానుగతముగా తమ తమ శిష్యులకు బోధింపబడి రానురాను కపట సన్యాసులు, వేషదారులునైన నేటి సన్యాసగుణములు లేని మనుజుల వలన పైకిరాకుండా గుప్తమగుచున్న మోక్షప్రదాయకమగు బ్రహ్మ విద్యా సాధన గురించి ముముక్షు జనోపయోగార్థము ఈ గ్రంథము వ్రాయ సంకల్పించి భాషా జ్ఞానము లేని సామాన్య మానవులనుండి, పండితులవరకు సులభముగా అర్థమగుటకై గ్రామ్య భాషలో పాటల రూపమున రచించితిని.

ఈ గ్రంథమునకు పంచ విధములైన చిత్త భూమికలలో మొదటిదగు తమోగుణాధిక్యత గల మూఢావస్థలో గల మానవుడు నిద్ర, ఆలస్యము మరుపు ప్రమాదము మొదలగు గుణములతో ఆవరింపబడి, ఈ గ్రంథసారమును గ్రహించు శక్తిలేక పోవుటచే అధికారి కానేరడు మరి ఇంకెవరు అధికారియగుదురో చూతము.

రెండవదగు రజోగుణాధిక్యతచే గూడుకొన్న క్షిప్తావస్థలో నున్న మానవుడు తద్గుణ సహజమగు చంచలత్వమువలన అంతఃకరణాధీనుడై తజ్జనితమగు కోరికల వలలో బడి కొట్టుమిట్టాడుచున్నాడు. ఈ కోరికలనునవి ఎడతెగని జలప్రవాహము వంటివి. ఒక కోరిక దీర్చుకొనునంతలోనే మరియొక కోరిక జనించి సతమతమగుచు పలుకష్టములనొందు చున్నాడు. మరి యొకప్పుడొక కోరికను తీర్చుకొన్నవాడై దానివలన లభించు అత్యల్ప సుఖమునే నిజమగు సుఖమని భ్రమించుచున్నాడు. ఈ విధముగా పిచ్చిపట్టిన కోతివలె పరువిడు అంతఃకరణమునకు లోబడి దేహాభిమానము గలవాడై కోరిక యను వలలో చిక్కుకొని మనుజుడు దారి దెలియక పలువెతల నొందుచున్నాడు.

పై అవస్థయందున్న మానవులు యొకతూరి ఆ కోరికల నుండి బయట పడు మార్గమును ఆలోచించవలసిన అవసరమెంతైనా గలదు. అట్లు ఆలోచించి నపుడు సహజముగా సుఖప్రాప్తి నిమిత్తమే జనించు ఈ కోరికలు ఏదేని ఒక శాశ్వత సుఖమునొసగు వస్తువు లభించిననే కాని నశించవని విశదమగును. అట్టి నిరాశా స్థితిని ప్రసాదించి స్వస్వరూపానందము నొసగునట్టి, కోరికల పుట్టను సమూలముగా నశింపజేయునదేదైతే గలదో ఆ వస్తువును గూర్చి బోధించునదే ఈ 'సోహామృతసార' గ్రంథము.

పై విధముగా ఎవరైతే శాశ్వతానంద పదవికై ప్రయత్నపరులై. సాధన చతుష్టయ సంపత్తి గలిగియుందురో వారే, ఈ గ్రంథమున కర్హులగుచున్నారు. కావున సాధన చతుష్టయ సంపత్తి గలిగిన ముముక్షువులును; జిజ్ఞాసువులును ఈ గ్రంథమును బాగుగా పఠించి గురు సమ్ముఖమున అనుష్ఠించి తరువాత చిత్త భూమికలగు సత్వగుణాధిక్యత గల విక్షిప్తావస్థను, శుద్ధ సత్వగుణ ప్రధానమగు ఏకాగ్రస్థితిని దాటి నిర్గుణ స్థితియగు నిరుద్ధావస్థను పొంది ఆపై మేరు శిఖరమెక్కి నిత్యానందమును, మోక్షము లేక పూర్ణయోగానందము బడయగలరు.

ఇట్లు

తమప్రియ సోదరుడయిన చరాచర సుఖాభిలాషియగు

**అవధూత నిర్మలానందస్వామి**

# కవి పరిచయము

శ్రీ స్వామీజీ చిన్న వయస్సుననే (7వ ఏటనే) గురువు గారి వద్ద ధ్యానోపదేశము తీసుకొనెను. అప్పటి నుండి యోగాభ్యాసము చేసి నిశ్చలమైన ధ్యానముద్రలో నిమగ్నమైయుండిరి. శ్రీ స్వామీజీ పలుచోట్ల తిరిగి ఎందరో మంది మహానుభావులను, దర్శించి, ఎందరో మేధావులతో చర్చించి, ప్రజల్లో సామాన్య పౌరుల్లాగ తిరుగుచు వారి హృదయ గ్రంథిలో వుత్పన్నమగు మంచీచెడు యాలోచనలను గ్రహించి వారిని సత్ప్రవర్తనతో ఉండగలరని యిప్పటి వరకు పలుచోట్ల ఉపన్యాసములు చేసినారు. వీరు "విశ్వమానవత సమాజము" అనే సంస్థను స్థాపితం చేసినారు. ముఖ్యముగా మన భారతదేశమున కుల, మతములను అధిగమించి, సంకుచిత భావములను కూల ద్రోసి ప్రేమాభిమానములతో మెలగవలెనని వీరి అభిప్రాయము. ఈ సుగుణాల గణిని గురించి వ్రాయడం గాని, చెప్పడం గాని చేతగాదు. వీరిని దర్శించి, చర్చించిన మహానుభావులెందరో వారి మనస్సును ఆదుపులో పెట్టుకొని వెళ్లిరని తెల్పవలెను. శ్రీ స్వామీజీ బయట స్వామీజీలాగ (యోగీశ్వరులలాగ) కనిపించకున్నను; యింటిలో ఉండి మనము అనుసరించినప్పుడు వారి నడక మనకు గోచరించును. అలాంటి మహానుభావుని హిత వచనంబులు విని తరించగలరని ఆశిస్తున్నాము. శ్రీ స్వామీజీ భారత దేశములోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమున తాలూకా, జిల్లా, మండలము నిజామాబాద్‌లోని ముదక్‌పల్లి గ్రామంబున శ్రీ గంగాగౌడ్ మరియు పోచమ్మగారల ఏకైక పుత్రరత్నము. ఇదే గ్రామమునకు చెందిన మట్టి మాణిక్యము మరియు శకుంతలమ్మగారల పుత్రికయైన మన మాతృమూర్తిగారలకు వివాహము జరిగినది. మాతగారు 8వ ఏటనే దీక్ష తీసుకొనెను. శ్రీ స్వామీజీ చిన్ననాటి నామము ఎ. నారాయణగౌడ్, మాతృమూర్తి చిన్ననాటి నామము యం. భాగ్యము. వీరికి వారి గురువుగారు "అవధూత నిర్మలానంద స్వామి" గా దీక్షానామము

నొసంగెను. మరియు మాతృమూ_ర్తిగారికి "జగత్పరం జ్యోతి" గా శ్రీ స్వామీజీ దీక్షానామము నొసంగెను. వీరి దగ్గర యెందరో బ్రహ్మచర్య దీక్షను తీసుకున్నారు. వారిలో ముఖ్యులు బ్రహ్మచారి నరహరిగారు. సమాజములో ప్రతి మానవుడు నిర్మల హృదయముతో జీవించాలనిబోధించిన ఈ బాలయోగి వచనములు నిత్య సత్యములు.

ఇట్లు

విశ్వమానవత సమాజము.

సోఽహం

గురుచరణం

శ్రీ

కం॥ శ్రీ గణనాధుని యెరిగియు
బాగుగ మర్ధించి పోయె । బాటకు యిపుడున్
శ్రీ గురుదేవుడు దెలిపిన
ఆ గణనాధుని వలిచెద । (కొలిచెద) నందరు మెచ్చన్

## గణపతి ప్రార్థన

### 1. తత్వం—భైరవి రాగం — ఏక

1. శ్రీ ఆధార పద్మమందు । ఆర్నూర్ల జపము యుందు । ఆది తావు నందు । ఆట లాడేటి సందు ॥ఆ॥
2. శ్రీ కీలు దెలసి వుండు । వ, శ, ష, స లుండు। నాలుగునాడులుండు। పృథివి భూతంబుండు ॥ఆ॥
3. ఎల్లలోకములెరుగు । ఎలుకపై ఎక్కిదిరుగు । మెల్లని చూపుమరుగు । తొల్లిగ భక్తి మెరుగు ॥ఆ॥
4. వంకర తొండముండు । శంకలు దీర్చుచుండు । సంకటంబు మెండు । చక్కగ బాపుచుండు ॥ఆ॥
5. అవధూత నిర్మలుని మంచి । నిజభక్తులకెపంచి । ధర్మమార్గంబె పెంచి । కర్మలన్నియు ద్రుంచి ॥ఆ॥

—ః భజన ః—

ఆదారములోన యెరుగు
అందమైన మరుగు

### 2. తత్వం-నాదనామ క్రియరాగం—ఆది

1. భావమందు మూగ ప్రేమ భజన వినరావ । భక్తజనుల సత్యదేవ కావగరావ ।
   హృదయ మందున ఆకులో మా మదిలో వెల్గెటి జ్యోతివి । వదుల లేము నీదు పూజ యెల్లకాలంబు—వినుము దండంబు ॥భా॥

2. ఐదు తలల కాలుడు. నీ కాలు సోకిన వెంటనే బాధయంతయు మరచిపోయి వోడిపోయెను—ఆడిపాడెమ ॥భా॥ 3. బాల నిర్మలానందుడు వోసీటిలోని దేవుడ పాలభాగము యందుజొచ్చి యేలుమన్నాడు—నేను పాయ సన్నాడు ॥భా॥

ః భజన ః

గురుని నమ్మితె నయం జయం

సద్గురుని నమ్మక బయం బయం

3. తత్వం—నాదనామ క్రియ రాగం—ఆది

ఓం నమో నారాయణాయః ఓం నమో నారాయణాయః

1. నారాయణయను నాల్గాక్షరములె నయముతో పంచి చదువ వలెన్‌। సారములేని సంసారము యందున మునిగిపోక తానుండ వలెన్ ॥నా॥ 2. సోహంబులో గురిమరిచె వరకు తను యేకాంతము నుండవలెన్। మోహ సంబంబిడి మేరు శిఖరముపై జేరి అమృతము గ్రోలవలెన్ ॥నా॥ 3. కుక్షిలోపల పక్షితో గలసి అక్షరంబుల గలుప వలెన్। లక్షార్థములో సాక్షి లోపల సాక్షై తానుండ వలెను ॥నా॥ 4. హృదయమందున నీ మనసు వుంచియు పడి లంబుగ జపించ వలెన్। వదలకుండ మొదటి నుండియు కొనవరకు తానెక్క వలెను ॥నా॥ 5. కుండలి స్థానము కుదురు జేసుకొని కండ్లు మూసి కూర్చుండ వలెన్। దండి మండపములు దాటుచునుంటె మాటలువినబడు మార్గమునన్ ॥నా॥ 6. బాలయోగి అవధూత నిర్మలానందుడు తెలిపిన మాటలివి కాలుడైన నీ దగ్గర రాకను గడగడ వనుకును భీతిల్లి ॥నా॥

తత్వం—మణి రంగు రాగం—ఆది

ఓం నమశివాః ఓం నమశివాః ఓం నమశివాః ఓం నమశివాః

1. నీ వాట లాడుబాట నీ భక్తుల సూటి మరపులో తేట॥ ప్రణవము లోపల నాదము నీవె నాదము లోపల వెలతురు నీవె। పంచభూతముల కర్తవు నీవె। పంచిమాడ పరమాత్మవు నీవె ॥నీ॥ 2. ఏడు చక్రముల౦దున నీవె । యేడింటిలో ఆ మెరుకవు నీవె। జోడగుండ్లలో కోడెవు నీవె మేడలోపల అద నీవె ॥నీ॥

3. అండాండంబులో నీవె నీవె। పిండాండంబులో నీవె నీవె। ఖండ ఖండములో నీవె నీవె। అఖండమైన బ్రహ్మాండము నీవె ॥నీ॥ 4. ఓం నమశివాయవు నీవె। ప్రాణము గానము అన్నియు నీవె॥ మౌనము లోపల బాలయోగి అవధూత నిర్మలానందుడు నీవె ॥నీ॥

భజనః— ఓం నమ శివాయః ఓం నమ శివాయః ఓం నమ శివాయః యను ఓజీవా.

## 5. తత్వం (ఇలవెల్పులోని చల్లని రాజ అనుమాదిరి)

1. ఆధార మందు అర్ధ్నార్లు ముందు । ఆది దేవుని యందు ఆటాడె సందు । అందులో ముందు ||ఆ||
నాల్గు నరముల గూటిలో నడిచాడును
నాల్గు అక్షరంబులు బుట్టి లయ మొందును
ఆరు నుంచి మొదలు—నలుపై నిమిషంబులు
కోరికను దీర్చి పై మెట్టులో ఆడును ||ఆ||

2. ఆరు నలు వొకటిపై నుంచి లింగంబులో
ఆరు దళములు అంటిన ఆ ఇంటిలో
ఆరు వేల జపము— చేరి చేసు నిజము
మీర కుండను వొకటిరుపై వరకుండును ||ఆ||

3. నాభి చక్రమున దళములు పది వుండును
నాభిలో ఆరు వేయిల జపముండును
ఒకటి ఇరుపై ఒకటి—నుంచి వదుల కుండ
రాత్రి యెనిమిది వరకుండి—పై బోవును ||ఆ||

4. హృదయ మందున పన్నెండు నాళ్ళుండును
హృదయములో ఆరు వేయిల పని వుండును
ఎనిమిదొకటి నుంచి—రెండు నలుపై వరకు
మనుష్య రాగానె పై ఇంటిలో నుండును ||ఆ||

5. కంఠ స్థానమున పదహారు త్రాళ్ళుండును
కంఠమున వేయి జపములు కదిలాడును
రెండు నలుపై వొకటి నుంచి వదులకుండ
వుండు మూడు నలుపై యారు— వరదాకను ||ఆ||

6. భ్రూ మధ్యమున దళమూలు రెండుండును
యేమారకను వొక వేయి యెగిరాడును
మూడు నలుపై యేడు—నుంచి విడువకుండ
ఆడు నాలుగు యాబై మూడు—వరకును ||ఆ||

7. వేయి దళములు సహస్రార చక్రంబున
వేయి జపములు జరుగును ఆతావున

నాల్గు యేబై నాల్గు–నుండి ఆరువాక
గోల జేయుచు క్రిందికి వచ్చాడును ॥ఆ॥

8. అవధూత నిర్మలుని భావంబులో
కీలు దెలిసిన సోహంబు ఆశ్వాసలో
మరువకుండ వుండు–నిరత మిడక మెండు
ఇరుపై వొక వేయి ఆరు వందల శ్వాసలో ॥ఆ॥

–ః భజన ః–

సోహం సోహంబను జీవా
మోహ వారధిని దాటెటి నావ

6. తత్వం–బాగేశ్వరి రాగం–జంపె

1. ఆధార మందున మనసు నిల్పుమురా । అందులొ యోశించి నిలచి చూడుమురా । పీత వర్ణము కుంకుమా కాంతి వినురా । మోత బెట్టుచులేచు ఈత నేర్పుమురా ॥ఆ॥ 2. లింగస్థానములోన సంగతెరుగుమురా । అక్కడ కను పించు శ్వేత వర్ణమురా । విధ్యుత్ కాంతిచే బహు వెలుగొందు వినురా । విద్య లోపలి బ్రహ్మ విద్య దెల్పుమురా ॥ఆ॥ 3. నాభిస్థానములోన నయముతో జూడు । నాభినుంచి వెడలు షట్కోణ కాడు । శ్యామాల వర్ణం బెట్టని కాంతి ఆడ । చక్కగ గురి నిల్పి చూచుకొ మేడ ॥ఆ॥ 4. హృదయ మందున నీల వర్ణంబు జూడు । ఆకు పచ్చని కాంతి అందులో జూడు । కంఠమందున జూడు కని పించు నీకు । పసుపు పచ్చని రంగు బాగ మర్థించి ॥ఆ॥ 5. భ్రూ మధ్యము నీవు గురి బెట్టి చూడు । బంగారు వర్ణంబు బాగుగా చూడు । మాణిక్య కాంతిచె మహి మెల్ల జూపు । మానక జేసితె మదిమొద మొందు ॥ఆ॥ పాల భాగము దాట చిత్రములు । కనిపించు చూడర ఖేచర్ని బట్టి । బాలయోగి అవధూత నిర్మలా నందుడు వెలిపేను మది మాల దిప్పి ॥ఆ॥

7. తత్వం–(నాసిక్‌లోని–దేఖ్ తేరి సంసారికి–అనుమాదిరి)

1. హృదయ మందున అదో ముఖముగ వ్రేలాడుచు నుండె మొగ్గ సరము లతో గూడి ॥మొ॥ అది కంఠమునకు జానెడు క్రింద । అది బొడ్డునకు జానెడు మీద । పదిలంబుగ కమలంబున జూడ । ముదముగ రంధ్రంబగుపడు ఆడ । వదులక జూడుము అంగుళ మంతయు బయలుండిన వాడ । పదె పదె తెల్పితి నా వాడ ॥ పదె॥ ॥హృ॥ 2. బయలందున జలముండును నిండ । బాగుగ

యోశించుము నీ వండ్ల । బయలున నీరులో అత్మండన్న । పచ్చని కాంతిచె ఊష్ణం బండ్ల భస్మము జేయును తిను వస్తువులను । నయము గాను వినురా నీలొ పరిశో దించుమురా ॥నీలొ॥ ॥హ్రా॥ 3. పంచభూతములు నీయందన్న । మంచిగనీలో యోశించన్న । పంచిచూడగ నీయందన్న । కొంపల జ్యోతి వెలుగుతదన్న। మంచిగా సాధించుము నీ లోపల మార్గంబగు పడురా సంచుల మర్మంబెరు గుమురా ॥సం॥ ॥హ్రా॥ 4. మట్టి గుండె కాయనెప్పృథి వంటి । నల్ల గుండెనె జలమని యంటి । ఇట్టి దొమ్మనె వాయుప్ర అంటి । చేదు అగ్ని యని గొప్పగ గంటి । వట్టి మాటలు వదుర బోక ముక్కైన గుండెనుజూడు అందులొ ఆకాశం బుండు ॥అం॥ ॥హ్రా॥ 5. అందరి యందున వుండెను గొప్ప । ఆశపాశమను కామము కుప్ప । బంద మందున మేఘము తెప్ప । నాశములేని ఆత్మను గప్ప చిందులు యేలవధూత నిర్మలానందుని జేరుమురా మేరుశిక మందున వుండుమురా ॥మే॥ ॥హ్రా॥

8. తత్వం—(మాయదారి మల్లిగాడులో—మల్లెపందిరినీడ)

1. నాభి క్రిందను పైకి వున్న ఓ జీవా—నాళ్ళుదెబ్బై రెండు వేలు వినలేవా ఆ నాభికి పై భాగము పదినాళ్ళోయి కుండలి గనుమోయి—నాభి క్రిందను పదియునాళ్ళుగనలేవా మేను యంత నిలచి నావి ఓ జీవా ॥నాభి॥ 2. తెలుసు కొమ్మురా నాళ్ళ గలిపే చక్రిమైనది వలకు మద్య మూడు నాడులు బుట్టియున్నవి వాయువుతో ఆ రెండు నాళ్ళ నిండి వుండును నీకాయమందు మద్య నాడి నీ గను తప్ప కుండాను ॥నాభి॥ 3. ఏడు చక్రిము లందు నరములు గూడు గట్టి జోడు తాడులల్లుకొని తిరుగు చుండే అవధూత నిర్మలా నందుని గని వుండాలి ఈ మర్మమే నిను దర్మలో నడి పించాలని వేడాలి ॥నాభి॥

9. తత్వం—(భార్య బిడ్డలు లో—ఆకులు పోకలు—అను మాదిరి)

1. సారము లేనిది సంసారం—ఆపోరుమాన్పుట బహుఘోరం మారుట కష్టం ఈ బేరం సాగర మీదగ బహుదూరం జీవా వినవా 2. కోరి పెంచే గాలి మేడ వో సంసారి దూరం బొర నిన్నిడి పోవురా ఎత్తైర్రి బుర్ర జూచి వెట్టిగాకు । ఆయెముడొచ్చిండపె నిను ఆదుకోరు—జీవా వినవా ...... .. 3. ఇంటిలో కినబడె పోరుమాన్పర—కొంటె వాళ్ళ జంటె నీ కంట నీయకు చంటి పిల్లడ—నీ వెంట మాయరా—మంటిలో బెట్టె దాక—మాననంటది । కంటితోనె గాల మేసి కదులనంటది—జీవా వినవా . .......... 4. బంద మందున నీవు చిక్కుకున్నావు । సందు గొందులు ముందు వదుల నంటావు—ముందున్నాది—నిన్నిడవ నంటది ।

ఆందంగ ఈ బోధ దెలిపె నేర్చుకో—నీ మందిరములో నిర్మలానందుని తెలిసేది ॥సారము॥

10. తత్వం—రేగుప్తి రాగం—ఆట

1. కంటిలోన వుండే కాశి విశ్వేశ్వరుని కనవెందుకే పాపిమనుసా । కంటి । మర్మము జంట వాయిద్యముల మ్రోత ఇంటింట సంగతె మనుసా ॥కం॥ 2. ఎరుపువర్ణమె పృథివి తెల్ల గ్రుడ్డె వుదకమెందు కెరుగవె పాపిమనుసా । పరి శోధన జేయు పై నలుపు అగ్నని నీలమె వాయువని మనుసా ॥కం॥ 3. అందులో కళ ఆకాశంబని నీవు సందు యేరుగవె పాపిమనుసా । సందేహమెందుకు విధ్యుల్లె ఖనిదె సరుగున దెల్యావె మనుసా ॥కం॥ 4. ఆ కళలో నిష్కళయే తానని యెగిరి పైకి జూడు పాపి మనుసా । ఆ ఘనమైన సందులో గండి దాటితి వంటె గాడ యేమున్నదె మనుసా ॥కం॥ 5. భద్రిముగ కనుగొంటె నిద్రి సంగంబులు అడచే బుట్టును మనుసా । ముద్రిలేఒను నిద్రలో నిద్రి దాటియు మేలొందవె పాపిమనుసా ॥కం॥ 6. కంటి మధ్యలో చూపు నిల్పి నిల్పి వొంటి మేడెక్కవె పాపిమనుసా । మంటబెట్టి లోన అవధూత నిర్మలానందుడై పోయెను మనుసా॥కం॥

11. తత్వం—(కురిసింది వాన అనుమాదిరి)

(ఒక గృహస్తుడు స్వాముల వారితో చెప్పిన పలుకులె ఇవి)

1. ఏలెడు తుంట చేసిన తంట— ఆ యవ్వన మందునా ॥ఏ॥ తాళ నీ వేళ గోలాయె చాల ॥ఏ॥ 2. వయసుతొ మనసు పరుగులు తీసి—కయ్యలో వేసెనూ ముసి ముసి నవ్వు పిస పిస జేసి నా కొంప ముంచేనూ ॥ఏ॥ తను పోవుదారి తగిలింది విడక ॥ఏ॥ 3. కనులలో కైపు కప్పుకపోయి—కనుగొననైతిని తనువును నమ్మి నిర్మలానంద తత్వము వద్దంటిని ॥క॥ బుగులు చాలయే— దిగులుబాగాయే ॥ఏ॥

12. తత్వం. (పాతాళభైరవిలోని కనుగొనగలనా అనుమాదిరి)

1. కనుగొనుమురా ఓ జీవా—గర్భములో పనినీ ॥క॥ దిన దినమునకు ఆ కోశమందున మరియెన్నెన్నో మార్పులురా కనుదాక అది యెట్టుల మారునొ ఏనూమా తెల్పెద జీవా ॥క॥ 2. గుజ్జు గుజ్జుగా వారమంతయు శుక్లశోణితా ముండును జీవ । గుజ్జు మారి ఆ గర్భమందున గట్టిగ ముద్దవు జీవా ॥క॥ 3. రెండొ మాసము తల మెదడుండు మూడొ మాసము పాదము పాణి । దండి గాను ఆ నాల్గొ మాసమె కడుపు బుట్టును జీవ ॥క॥ 4. ప్రక్క బొక్కలు వెన్ను బుట్టును మేను యంతయు రోమముతొలు । చక్కగాను విను ఐదొమాసము ఇవియే

యేర్పడు జీవ ॥క॥ 5. ఆరొమాసము నవరంధ్రిములు అన్ని యేర్పడి హోవును జీవ । జోరు జోరుగా యేడొ మాసము నిండిన కొలది జీవ ॥క॥ 6. తల్లి బీల్చెటి శ్వాసతో జేరి జీవి గర్భము లోపల బోవు పిల్ల చుట్టు వొాక పేగ్రు చుట్టుక కదులు చుండును జీవ ॥క॥ 7. అష్ట మాసము నవ మాసంబు జ్ఞాన మేర్పడి చింతలో నుండు । కష్ట మొందుచు రెండు చేతుల యెత్తియు వచ్చును జీవ ॥క॥ 8. కీలు దెల్సుకొ ముందుగ నీవు । మేలు నొందెవు చాలగ జీవ । బాలయోగి అవధూత నిర్మలానందుడు దెలిపెను జీవ ॥క॥

## 13. తత్వం—కన్నడ రాగం—ఆట

1. పాత్రి నెరిగి బెట్టు బిక్షంబు । మిత్రమయా । ధాత్రిలోన దొంగ లున్నారు । మిత్రులై తన వద్ద వచ్చి పవిత్రమైన రహస్యమంతయు । శతృలై ఇతరులకు జెప్పుచు మూర్ఖుడనుచును వాడు చుందురు ॥పా॥ 2. తీపి మాటలు మాట్లాడే కపట నాటక సూత్రదారులు । తేప తేపకు వచ్చి ప్రపంచ మందున చెడుపు జేతురు ॥పా॥ 3. ముఖము జూచి మోసపోకు । మూలంబు చెప్పి చెడకు । తికమక పడకుండ ఖలునిచె దూరముండుటె మంచిదని బహు ॥పా॥ 4. అవధూత నిర్మలానంద మాటలు నిజమైన తత్వ బాటలు । మూర్ఖులకును అందబోదిట మూలంబె దెల్య రాదట ॥పా॥

## 14. తత్వం-నారాయణ గౌళ రాగం-ఆది

1. మూటిని దాటె మూలము దెల్యుము సూటిలో మనసు నాటించి । మేటి శికరమును బాట దెరసి దాటి అమృతము గ్రోలుమయా ॥మూ॥ 2. వాయు భక్షణ జేసియు నీవు । రోయుము విషయ కామ్యములావు । కాయములో ఉపాయము దెలసి మాయ భ్రాంతుల వదులవయా ॥మూ॥ 3. నిందలెన్నియు వచ్చిన తొందరడెందములో పడబోకు । మందిరంబులో బందన దొలిగిన అందమగు ఆనందం ॥మూ॥ 4. ధారపుత్రుల కూరిమి విడచి మేనులోన మేన్మ రచి । క్రూర గుణంబులు విడచి నీ లోపల సారము చక్కగ దెల్యుయయా ॥మూ॥ 5. పరమ పదంబు జూపెటి అవధూత నిర్మలానంద । దురితములను తొలగించు మనచు నీ అభ్యాసము జోడించు ॥మూ॥

## 15. తత్వం—ధర శంకరాభరణ రాగం—ఆది

1. రెండు త్రోవలు గలిసెన్ రెండింటిపైన మండె మంట వుండెను । మొండి మాటలు మాని మోదంబుతో నేడు । దండిగ సద్గురుని ఆశ్రయించిన

దెల్యు ॥రెండు॥ 2. దండి కొండ పైనను । రెండు గుండ్లు వుండెను త్రిరంగుల । గుండ్లాగ్రి మందున సన్నాని బిలమందు । మరకటంబు వుండె మలిపి కలుపు గుండ్ల ॥రెండు॥ 3. పొంగేటి నదుల దాటె । సంగతి దెల్యు । అంగంబులోన నేడు భంగంబు జెందక కంగారు పడబోక । దొంగల గేల్చియు లింగన్ని గోల్వుము ॥రెండు॥ 4. యోగ మార్గము దెల్పెను । బాగుగాను । రాగ ద్వేషము రాల్చియు । యోగవధూత నిర్మలానందుడు సోహం భావము దెలిపె మోహ గుణముల విడ్వు ॥రెండు॥

## 16. తత్వం—భూపాల రాగం-ఆట

1. కాయ మందున । గాంచుము జీవా । న్యాయ ముందిన । తోయకను చింలిచె నెందుకు । రెండు తోవ్రలు గలిసి యుండిన । బాయి లోపల నాతి యున్నది । దెలిసి యుంటె మోక్షమున్నది ॥కా॥ 2. గంగ యమునల సంగ మున్నది । సంగమందున లింగమున్నది పొంగుచున్న నదుల లోపల పొలతి స్నానము జేయుచున్నది ॥కా॥ 3. మదములెనిమిది అనచలేకను । కుదురుగ మది నిల్ప లేకను । వదుల జాలరు మాయ జాలము వదురుబోతుల మాట వినుచు ॥కా॥ 4. పెక్కు రీతుల దిరుగ బోకను । ముక్కు యందున దృష్టి నడిపి । చక్కగ సహస్రారమందున దృక్కు నిల్పుము మనుసు బెట్టి ॥కా॥ 5. జోడు పక్షుల గూడి యుండెన । మేడపై నొక ఆడదున్నది । మూడు దారులు దాటి అవధూత నిర్మలానంద దెల్పె ॥కా॥

## 17. తత్వం-శుద్ధ సావేరి—చాపు

1. నేత్రి ద్వయము నడుమ యేదొ చూడు । సూత్రంబు మరి దెల్సియు । మూత్రి గుంటకు ఫోమసి మురుగు బురదలో మునిగి । నిజమైన తత్వంబు మరచి పోకవి గదరా ॥నే॥ 2. చక్షు రాగ్రము నందున బహు తేజంబు । చక్కగ గురి నిల్పుమా । పశ్చిమ వీధిన పరుగు దీసి నీవు । మచ్చికతో గురి మర్మంబు దెలుసుకో ॥నే॥ 3. చదువు మోక్షము విద్యను । పదిలంబుగ వదులాక సాధించుము । ముదముతో తొమ్మిది రంధ్రంబులా మూసి । పదవ ద్వారము నందు పావించి మది నిల్పు ॥నే॥ 4. ఆరు గుణముల నరుకుము । తొమ్మిదిండ్లపై మేరు శికరం బెక్కుము ధీరత్వమును బూను । పరమా శ్రేష్టంబదియే । వైరాగ్యం వీడక సారంబు గైకొమ్ము ॥నే॥ 5. బాగుగా యోచించుమా॥ వేగ నీవు । యోగా మృతము గ్రోలుమా । యోగావధూత నిర్మలానందుని జేరి । భవ రోగముల మందు బాగుగా యోచించు ॥నే॥

## 18. తత్వం—కేదార గౌళరాగం—ఆట

1. వయసుతో పని లేదు మూడు । యేరులందున మనసు యెసర వేయు, విషయ నిషల మరచి శాస్త్రవాసన విడచి । బ్రహ్మానందములోన మునిగి పోయిన జయము ॥వ॥ 2. మొండి మాటలు మాని నీవు । మోహ గుణములన్ని కోసి వేసి । దండి కొండ శిఖరమందు రెండు గండు । మీనులపై కొత్తి । పండు వెన్నెల జూడు ॥వ॥ 3. మూటిని దాటెటి మూలం । నీ నోటిలోనె పుండి తాళం వాటంబుగ నీవు ఆరు మూడు మూసి । మేటి శిఖరములోన కూటస్థు నెరగూము ॥వ॥ 4. రాతి దేవుని కన్నమిన్న నీ పీతి దేవుడె నయము వినురా । ప్రీతితో అవధూత నిర్మలానందుడు । చాతి చక్కగ వుంచి గుదములాగు మనెను ॥వ॥

## 19. బేగడ రాగం—చాపు

1. లింగంబు సంగతి అంగమందునపొంగె । గంగయమునల దాటి చూడుమురా దొంగ గుణముల విడక దండిగ జెప్పిన । సరిగ సహితంపైన లింగ మెరుగ తరమా ॥లిం॥ 2. కన్నుల లోపల మన్ననతో నీవు । సన్నని బిలమందు దూరమురా । పున్నమ వెన్నెల అన్నలార మీరు । చిన్నగ జూచిన మిన్నగ నుండేరు ॥లిం॥ 3. సూటి బెట్టుము నీవు భ్రూమధ్యమందున । కోటి సూర్యుల కాంతి కొదువ లేక వాటంబుగను యిూడ పింగళను దాటియు । మేటి శిఖరముపైన మెదిలిన మేలౌను ॥లిం॥ 4. ఆరు మేడలోన హంసతో కూరిమిగ । గురి నిల్పి ప్రణవమున గూడవలెను । చేరుము అవధూత నిర్మలానందుని । కోరిక లిడచియు మేరు శిఖరము పైన ॥లిం॥

## 20. తత్వం-నీలాంబరి రాగం—ఆది

1. శుక్లశోణితముల వలన బుట్టిన దేహమే అన్నకోశమయ । ఆలోచించుము ఆత్మ వెల్లిపోయిన పృథిలో బెట్టుట తథ్యమయ ॥షు॥ 2. పంచకర్మేంద్రియములు పంచ ప్రాణములు జేరిన ప్రాణమయ కోశమయ । పంచి చూడగ దశ వాయువులు ఆత్మగాదని తెలిసెనయ ॥షు॥ 3. జ్ఞానేంద్రియములు మనసు గలిపిన మనోమయ కోశమయ । వీణుల విందు గంటె ఇది ఆత్మగాదని తెలిసెనయ ॥షు॥ 4. పంచ జ్ఞానేంద్రియములు బుద్ధిగలిసినవి జ్ఞానకోశం బాయెనయ । మంచిగ యోచించిన ఈ కోశము ఆత్మగాదని తెలిసెనయ ॥షు॥ 5. ప్రియ అప్రియమను అజ్ఞానంబుకు అంతఃకరణములే తోడయ్యె । నయముగ గంటె పీటితోడనె ఆనందకోశము వెలిసెనయ ॥షు॥ 6. ఇట్టి కోశములు నేను గాదని గుట్టుగ దెలుసుకో గురు-వల్లన పట్టు వదులక అవధూత నిర్మలానందుడు దెలిపెను ॥షు॥

## 21. తత్వం—శంకరాభరణ రాగం—ఆట

1. కనుము వో మనుస నీవు। కనులు తెరచియైన మూసియైన। మనసు బెట్టుము। భ్రూమధ్యమందున లావు। వినుము దీనిని ఖేచరి ముద్ర యందురు ॥క॥ 2. నయణములు కదిలించకుండ। నాసికాగ్రమందు దృష్టి మెండు। బయము బట్ట కుండ బెట్టిన దాన్నె। భూచరి ముద్రని పుడమిలో జెప్పిరి ॥క॥ 3. నాసిక మధ్యంబు చూడు। దృష్టి నిల్పి అంతర్లక్షంబున నేడు। మోసపోకు వినుము ఆ చూపునె అంతర్ మధ్య లక్షణమని భక్తులు దెలిపిరి ॥క॥ 4. నేత్ర రంధ్రంబూలు రెండు। శ్రోతరంధ్రములు రెండు। యాత్రికుడ వినునీవు నాసరంధ్రంబులు। మూసి భ్రూమధ్యమున జూచునదెశన్ముఖి ॥క॥ 5. అంతర్లక్షంబున నీవు। బాహ్య దృష్టియు గలిగీయులావు। శాంతంబు తోడుత మనో మారుతంబుల వికారంబులు లేక వుండునదె శాంబావి ॥క॥ 6. సూర్య చంద్రుల నడుమ వుండు। బిందు నైక్యంబు గావించు చుండు। భార్య పుత్రులపై భ్రమలు యేలనండి। అవధూత నిర్మలానందును జేరండి ॥క॥

## 22. తత్వం—చక్రవాక రాగం—ఏక

1. ప్రాణంబులా వివరమన్న। నీలో పరిశోదించి చూడు పరగరోరన్న ॥ప్రా॥ ప్రాణ వాయువు హృదయ మందుండురన్న। గాణంబు జేయును ఉపిరైరన్న। కొనకు నాసికమును బందించిరన్న। మల మూత్రములు దెసై మరణంబెరన్న ॥ప్రా॥ 2. గుదమందు అపాన వాయువుండన్న। మదిలోన యోశించి చూచుకోరన్న। మూత్ర ద్వారము మూసి జిహ్వాచెరన్న। మృత్యువును దెచ్చును సత్యంబురన్న ॥ప్రా॥ 3. ఉదాన వాయువు కంఠమందన్న। పదిలముగ కూర్చుండి చూచుకోరన్న। తుదకు కాళ్ళు చల్లగను జేసెరన్న। కంటి దృష్టిని దప్పించు వినుమన్న ॥ప్రా॥ 4. సమాన వాయువు బొడ్డులో నుండు। సకల నాడులాను పంపించు చుండు। వాక్కు కర్ణములను బందించి మెండు। చక్కగ మరణంబు దెచ్చుచు చుండు ॥ప్రా॥ 5. వ్యాన వాయువు నీలొ నిజముగరన్న। మేనంత వ్యాపించి వున్నదిరన్న। మేనుపై దగులు శీతోష్ణంబురన్న తెలుసుకొనుము చాల పరికించుమన్న ॥ప్రా॥ 6. నాగ వాయువు కంఠ మందుండురన్న। బాగుగా వాంతీని బుట్టించురన్న। ఘనముగ కూర్మ వాయువు నీలొరన్న। కనురెప్పలను తెరచి మూతవేయన్న ॥ప్రా॥ 7. తుమ్ము వచ్చునట్లు జేయు నీకన్న। యిమ్మహిలో కృకర వాయువురన్న। దేవదత్త

వాయువు నీకురన్న । ఆవలింపులను బుట్టించురన్న ॥ప్రా॥ 8. ప్రసవ కాల మందు శిశువూను రన్న । గర్భకోశము నుండి బయటనెట్టిన్న । పుట్టినప్పటి నుంచి పెట్టువరకన్న । ఇట్టి ధనంజ వాయువునుండురన్న ॥ప్రా॥ 9. తోలు బొమ్మలో చాల కీలుందిరన్న । అవధూత నిర్మలానందుడురన్న ।మెలైన బోధను జేసె వినుమన్న వాలయంబుగ నీదు వాంచలిడుమన్న ॥ప్రా॥

## 23. తత్వం—దర్బారు రాగం—ఆట

1. సంతోషమున నీవు వినుము । జీవా । చాయ పురుషుని జూచె విధము । శాంతంబు వాహించి ఉదయమందున నేడె । పంతంబు విడనాడి సద్గురుని కృప తోడ ॥సం॥ 2. నీ నీడ కంఠంబుపైన । దృక్కు । నిల్పియు గగనంబు జూడు । కానవచ్చును చాయ మబ్బువోలె నీకు । దాని వివరంబంత దయ తోడ దెలుసుకో ॥సం॥ 3. కరమూలు మరియు చేతులు । నీకు । కనుపించుకున్నాను వినుమా।మరణంబు దప్పదు శిరము లేకున్నను।మరువాక జూసుకొ ప్రతి శుక్రవారంబు ॥సం॥ 4. నీలంబుగా నుండె నేని ।మనకు। మరణంబు దప్పదుగనుము। వాలయంబుగ పీత వర్ణంబు నుండెనా । ధనము గల్గుచుండు తప్పదు అది మెండు ॥సం॥ 5. ఎరుపు వర్ణముండెనేని । పృథివికి । రా జౌను వినుము । పురుషుడు కృష్ణుడై కనిపించిన నీకు ధనహాని గల్గును తప్పబోదుయప్ప ॥సం॥ 6. రవి చంద్రులను నిల్పుమనెను । శాయ । వశము జేసుకొమ్మనెను । అవధూత నిర్మలానందుడు ఈ బోధ । అనుభవముచె జెప్పె అందరు మెచ్చగ ॥సం॥

## 24. తత్వం—భీమ్‌ప్లాస్ రాగం-ఏక

1. మరణంబు చూచె నవిని దెలుసుకో । మర్మామెరగి మరి జూచుకో । మరుగు దెలుసుకోరా జరుగు నిజము వినురా ॥మ॥ 2. నాలుక నల్లగ మారిపోయిన। చాలగ ముఖమెరుపై పోయిన । కాలము దగ్గర వచ్చెనియెంచి । మరుగు దెలుసుకోరా। జరుగు నిజము వినురా ॥మ॥ 3. అరుంధతి నక్షత్రము కనపడకుండినా। పూర్ణ చంద్రుడు మలినము గొట్టిన । ఇట్టి వాడు సంవత్సరము బ్రతుకు నిజము వినురా । క్షితిలో జరుగు గనురా ॥మ॥ 4. అద్దము యందు కోతి విధము । నీ తనువు కనిపించిన మరణం । అవధూత నిర్మలానందుడు దెలిపె ॥మ॥

## 25. తత్వం—నాటక ప్రియ రాగం—ఆది

1. ఏడు దొంతులపైన వొక్క । ఎలుక వున్నదిరా । ఎలుక ముక్కు కొనకు సర్వము యిమిడి యున్నదిరా ॥ఏ॥ 2. మూడొ బావిలోపల వొకగూడు

వున్నదిరా । గూడులోన పాము నిద్రలో పండుకున్నదిరా । చూడ చూడగ నాళ్గొ మేతలొ అగ్ని బుట్టెనురా । మూడు దార్లు గలిసె చోట మంట ఆయెనురా ॥ఏ॥ 3. బండ్ల మీద రెండుయేన్గులు పయనించు చుండెనురా । కండ్లజూచిన దోమ ఒక్కటి ఒక్క గుటుకకె మ్రింగెరా । రెండు తలల నెమలి యాడగ కోతి తబూలా గొట్టెరా । గండు పులుల జూచి భయపడి చెట్టుకొనపైకెగిరెరా ॥ఏ॥ 4 కుక్కలెన్నియో పోట్లాడగ । ఒక్క నల్లి జూచెరా । కుక్కలన్నిటిని బట్టి తుక్కు తుక్కు జేసెరా । నిర్మలంబుగ మనసు వుంచి కండ్లు మూసి చూదరా । అవధూత నిర్మలానందుడు దెల్పిన జాడరా ॥ఏ॥

26. తత్వం—మాయ మాళవ గౌళ రాగం—ఆట

1. మురువకుర నరుడా ఓ నరుడా । పరుగు తీయబోకురా ఓ నరుడా । భార్య పుత్రులు వున్న । సిరియెంత వున్నగాని కరి మ్రింగి నెలుగ పండు గతి నీదె సుమ్మ ॥ము॥ 2. అన్నదమ్ముల జూచియు ఓ నరుడా । అతి మురిసెదవు కాని ఓ నరుడా । కన్న సుతులను బెంచి కానకున్నవు నీవు మన్నులొ బెట్టేటి నాడు యెవరు నీ వారు చూడు ॥ము॥ 3. ఎన్ని వున్న నీకురా ఓ నరుడా । అన్ని సున్నైపోవు పామరుడా । కొన్ని నాళ్ళ ముచ్చట తను జూడను । కన్న గురుని జేరు సమ్మాతి తోడుత ॥ము॥ 4. ఎక్కడి నీ వారురా ఓ నరుడా । గ్రక్కున దెల్యవేర ఓ నరుడా । చక్కని ప్రపంచ మాయలొ జిక్కియు । మక్కువ తోడ నీవు మరిగి పొయ్యేటివిరా ॥ము॥ 5. ధరణి శ్రీ ముదకుపల్లి అవధూత । నిర్మలానందుడురా సరుగున వచియించె । సర్వంబు మిథ్యయని, నిర్వికారుని దెల్యనీలొ నీవె నేడు ॥ము॥

27. తత్వం-శ్రీరంజని రాగం—ఏక

1. ఎదుటి వాన్ని ప్రేమించరా । ఎదుటి వాన్ని ఆదారించరా । దయతో జూడరా । ఎదుటి వాన్ని ప్రేమించలేనివాడు । ఎరుగలేడు దేవుని । ఇది సత్యం । ఇదే మనమతం । అందుకె ॥ఎ॥ 2. మనము ఒకరి నొకరు ప్రేమించునాడు మన హృదయంబులో నివసించు దేవుడు । మన హృదయంబులొ దయ లేని నాడు । మన హృదయంబులో దేవుడుండబోడు । అందుకె ॥ఎ॥ 3. కులమతాల మురికి కొంప వదులవేమి । కలసి మెలసి వుండె కలుగు బలము కలిమి । మౌన వ్రతములో మనసు నిల్పవేమి । మహా అవధూత నిర్మలానందునెరుగవేమి ॥ఎ॥

## 28. తత్వం-ఝుం ఝుంటి రాగం—ఆట

1. ధార పుత్రులపైన ధన ధాన్యములపైన ప్రీతి గలిగించేటి కామమా । శూరుడైన ఆనరక సూరుడు నీచె ఘోర మరణమునొందె కామమా ॥దా॥ 2. ఒరులు సుఖపడగ వోర్వలేకను నీవు తికమక పడెదావె క్రోదమా ఒక సూరుడు నీచె బల వంతుడాననుచు భూమిపాలై పోయె క్రోదమా ॥ధా॥ 3. పరులకీయకుండ తనకె కావలెననుచు పాటుపడగ జేయు లోభమా । ధరణి యేలెదననుచు ధారుణిపై గూలె ధుర్యోదనుడు నీచె లోభమా ॥ధా॥ 4. మాతృ పుత్రకళ త్రాదుల యందున ప్రీతి గలిగించేటి మోహమా । పుత్రప్రేమ చేత దశరథ మహారాజు దాత్రిపై గూలెనె మోహమా ॥ధా॥ 5. ధనమధిక ముందనుచు కనులు పొరలు గప్పి పరులకానక దిరిగె మదమా । ఘనుడనుచు జెప్పియు కార్త వీరార్జునుని గతియెట్లు జేసిలివె మదమా ॥ధా॥ 6. పరశ్రేయస్సును జూచి వోర్వ లేకుండను పరిగీడు చుండేటి మత్సారంబు । శిరముబోయె శ్రీకృష్ణుని చక్రముచే శిశుపాలునిది నీచె మత్సారంబు ॥ధా॥ 7. బాలయోగి అవధూత నిర్మలుండు బాగుగా వచియించె వినుమా । కీలు దెలుసుకోని కాలుని జయించి పాల భాగము జూడు మెండు ॥ధా॥

## 29. తత్వం—అంగోలి రాగం-ఆట

1. పసిబాలుని విధము పిస పిసజేయుచు బ్రహ్మానందము బొందుటెన్నడో । కన్నుల కదిలించి మేరు శిఖరముపైన కదులాక నిలుచుండె దెప్పుడో ॥ప॥ 2. పంచ ప్రాణంబుల పొగరనలచి కంటిలో । పాపలోపల జూచెదెప్పుడో । హృదయమందున శ్రీమాన్ నారాయణుని యెరిగి మృదుమధ్యముగా నుండే దెన్నడో ॥ప॥ 3. సప్తవ్యాహృతుల సాదినముల వుంచి శాంతనందము బొందు టెన్నడో । మూలంబు గనుగొని ముక్తి కాంతను దాటి తనువు మరసి మురిసె దెప్పుడో ॥ప॥ 4. నాలుక క్రింద జలమెండి పోయి నాకు నాదంబు వినబడు టెన్నడో । బాల అవధూత నిర్మలానందుడై కాలుని జయించెదెప్పుడో ॥ప॥

## 30. తత్వం_(సువర్ణ సుందరిలో అలుగకురా పిలువకురా అనుమాదిరి)

1. మరువకురా । నిరతముగా । మరి మరి మదిలో ఓ నరుడా । తర చుగ గురిలో యీ జాడ ॥మ॥ అర్ధముపైన శ్వాసను ఊది....ఆ ముద్దుగ జూతర తత్వము నీవి బుద్ధిమంతులిది। శుద్ధిగ గనుమిది- పద్ధతి విడువకమెలుగ నిజమిది ॥మ॥ 2. ముక్కున రంధ్రముల మధ్యన ఆడు .... ఆ ........ ముప్పయారు నిమిషంబులు చూడు చక్కగాను భూతత్వ మక్కడ ॥ప॥ 3 జలతత్వంబు

క్రిందికి ఆడు ....ఆ ...... చల్లగా తాకును తప్పక జూడు తెలుసుకొ ముప్పైనిమిష ములుండు ॥ప॥ 4. నరుడ అగ్ని తత్వము మెండు ...... ఆ ...... ఇరవై నాలుగు నిముషములుండు మురిసిపోకను మూలము గ్రైకొను ॥ప॥ 5. పద్దెంది నిమిషంబులు నడచు ......... ఆ...వాయుతత్వము అడ్డమునాడు కొద్ది కొద్దిగ యోచన జేసిన ॥ప॥ 6. పన్నెండు నిమిషములాకాశం ...... ఆ ...... చిన్నగ లక్షించిన లేకుండు ముదుకుపల్లిలో నిర్మలానందుడు ॥ప॥ ॥ము॥

## 31. తత్వం—రేగుప్తి రాగం—చాపు

1. యోగమార్గము యెరుగరండి । బోగ । శ్రేష్టత్వ రోగం బిడండి । రాగ ద్వేషముల బాగుగద్రుంచియు । యోగంబు మార్గంబు యెరగితె సుఖమండి । ॥యో॥ 2. మాంస భక్షణ మానుకొండి । హింస । కల్లు సారల త్రాగకండి హంస భావము దెలసి సంశయంబును విడచి । మంచి తత్వము దెలసి సంచితం బును ద్రుంచి ॥యో॥ 3. మొండి తర్కము మానుకొండి । దండి । కొండ లెక్కుట నేర్చుకోరడి । తిండిబోతు వయ్యి కండ బెంచి యున్న । మండె మంట లోన మసిగాక పోవునా ॥యో॥ 4. సన్నని బిలమందువున్న । అవధూత నిర్మ లానందుని గన్న పున్నమచంద్రుండు వన్నెమీరగ వచ్చి ఆటలాడుచునుండు కన్నుల పండుగ ॥యో॥

## 32. తత్వం—మాండు రాగం—అది

1. ఓ నరుడా వినము నా మాట । నీ మనసులో నిజముగను తేట । మేనులో జరిగె పోట్లాట । కనిపెట్టి మాన్పుమిదె నాట ॥ఓ॥ 2. పుట్టలో వెయ్యి యేండ్లుండు । గట్టి నాగుపాము యిల మెండు । చిట్ట చివరకేమయ్యి వుండు । అందులో లాభంబు లేకుండు ॥ఓ॥ 3. దుర్గుణములు విడచి చూడండి । ఆరు గిరులు యెక్కిచూడండి । తారకము తనలో యెరుగండి । కోరికల ద్రుంచి వేయండి ॥ఓ॥ 4. నమ్మకు బొమ్మనెప్పుడు । బొమ్మలో జ్యోతి నెరుగుడు । నమ్మతితో గుర్తెరిగి నడువు । ఇమ్మహిలో స్వప్నభ్రాంతిడవు ॥ఓ॥ 5. నిజముగ నమ్ము యిదేబాట । అవధూత నిర్మలానందాట । శరీరము వుండ బోదట । పరమార్థము యిపుడె దెల్పుంట ॥ఓ॥

## 33. కనకాంగి—ఆట

1. కొంటె పనులు మానవైతివి । ఇంటిలున్న చంటి పిల్లను దెల్పవైతివీ । కంటి దృష్టిని మరుపలేకను । జంట నాళ్ళను నిల్పలేకను । ఇంటిలో పోరనచలేకను మంటి బొమ్మను నమ్ముకొంటివి ॥కొం॥ 2. మదము తెనిమిది

అనచలేకను । పదిలముగమది నిల్పలేకను వదురుభోతుల మాటలినుము । వదుం నైలివి మాయజాలము ॥కొ॥ 3. చెట్టులోపల పట్టువిడువక । గుట్టు దెల్సియు ఐదు పండ్లది । గుత్తి నిట్టము గాను పున్నది । ఇట్టి బోధను మెరుగకుండ ॥కొ॥ 4. రెండు శ్వాసల మార్చి మార్చి । మొండి తర్కము మానుకోని । రెండు వొకటి గంటలాపుము । హృదయ మందున జ్యోతి లేపుము ॥కొ॥ 5. సిద్ధాసనంబువేసి మొద్దులాగ కదులకుండ । ముద్దుగ ఆవధూత నిర్మలా నందుడు పెలుప ॥కొ॥

## 34. తత్వం—సిందోళ రాగం—జంపె

1. నాదంబెంతో మోదం సాదించవె సకలం మనుసా ॥నా॥ ఐదాక్షరముల శోదించి—ఐద్వైదు లిరువయైదును బంచి। భేదము విడచియు భాద మరచియు। పొదుగ ప్రాణాపాణము గలుపుము ॥నా॥ 2. కద్దివలె తన ముద్దినినిల్పి । బొత్తులోపల ఆటను మాన్పి । ముడ్డిపొంట ఆదిడ్డిలో జొచ్చిన దిట్ట మౌ మనసు దీనుని వలెను ॥నా॥ 3. క్రింది కొండలో ఆడేటి శ్వాసను ముందుండె కొండలపై నిల్చుచు దండగ పైకెక్కియు తా తనలో । మండె మంటలోకాలి కూలవలె ॥నా॥ 4. మింటు మనసును వొంటిగ జేసియు । కంటిలోన ఆ కన్నునుదెరసి జంట రేకుల మధ్యన నిలచి చంటి పిల్లడ పాలను గ్రోలుము ॥నా॥ 5. జోడు గుండ్లను మలిపి కలిపిన । మాడలొంటబడు ఇన్ని జేసిన । జాడ దెలిసియు మేరు శికర యులో ధీరుడవై తా నుండవలెన్ ॥నా॥ 6. అవధూత నిర్మలానందుని మాట । నాలుకపై కొత్తియు ఆ బాట । పాలభాగమున జొచ్చిన యాట । కీలు దెలిపెను మేలు నీ కిచట ॥నా॥

## 35. తత్వం-మాండు రాగం-ఆది

1. దర్పణ భావ మెరుగరండి । కర్పూర జ్యోతి జూడండి । నేర్పుతో వోర్పు పుంచండి । సర్పంబు పైకి యెగురండి ॥ద॥ 2. వాకిళ్ళ మూసి చూడండి । జోకతో ఇండ్లు దాటండి । ఏకముగ దృష్టి నడుపండి మోనలేని కాంతి జూడండి ॥ద॥ 3. నేత్రములో సూత్ర మెరుగండి । క్షేత్రములో యాత్రజేయండి । మూత్రములో మునిగిపోకండి చిత్రంబుల జూచి భ్రమకండి ॥ద॥ 4. చుక్క చుక్కలు బడునండి । అమృతము కంఠమందండి । కుక్కవలె దిరుగబోకండి । చక్కని గురును జేరండి ॥ద॥ 5. జంటను వొంటి జేయండి మంటలో మర్మమెరుగండి । ఇంటిలో పోరుమాన్పండి । అంటని ఆత్మ నెరగండి ॥ద॥ 6. నిర్మలమైన స్థలమందు అవధూత నిర్మలానందు । కర్మములు కాలి కూలెను । ధర్మంబె మిగిలి పోయెను ॥ద॥

## 39. తత్వం-మోహన రాగం-ఆట

1. మేరు శిఖరము లోన అటె జిక్కె పద్ధతి ఇకనన్న దెల్యవె జీవా । జోరు జోరుగా యెన్నో గ్రంధముల్ జదివి తుదకెందుకు కొరగావె జీవా ॥మే॥ 2. కుక్షిలోపల మూడు మూలల దెరసియు। కూర్చుండవే మాయ జీవా। పక్షి పయనించి అటె వుండె సంగతి యెప్పుడు నేర్చేవు జీవా ॥మేరు॥ 3. క్షణ క్షణము శ్వాస సచ్చుచు నుండెను । కనుగొనవే పాపి జీవా । కనులలో పంచభూతంబుల । దాటియు కరిగి పోవె మాయ జీవా ॥మే॥ 4. యెందుకు వచ్చి యీ బొందల బడితివో । యెరుగ లేవా పాపి జీవా । సందులో నుంచియు బొందలో బడితి ఇకనన్న దెల్యవే జీవా ॥మే॥ 5. అవధూత నిర్మలానందుని మాటలు ఆలకించవె పాపి జీవా । అందరాని పదవి అందరిలొ నుండె । అందులో లయ మొందు జీవా ॥మే॥

## 40. తత్వం-ముఖారి రాగం-ఆట

1. గోపుర మందున గోప్యంబు కనుగొని దీప కాంతిని జూడుమా । చూపులొ చూపు కలిపి యేకము జేయుమా । తేప తేపకు మూత్ర గుంట యందున మునిగి । కోప తాపము విడక పాడై పోకుము జీవా ॥గో॥ భవ రోగములల మందు బాగుగ యోశించి । నవరంధ్రముల మూయుమా । రవి చంద్రుల ద్రిప్పి మందును గ్రోలుమా । సవినయముగ నీవు శ్వాసలొ సోహంబు । చక్కగ గూర్చుండి మరువాక జపియించు ॥గో॥ 3. మూడు దారులు గలసి ముడిబడి యుండెను । మూడులు వినజాలరు ।నే జెప్పిన జాడగై కొన జాలరు । నేడో రేపో పాతబడన యీ కొంపకు । కీడు వచ్చు నిజము కేవేయకు జీవా ॥గో॥ 4. నూటిలోన మనసు నాటించి చూడగ । నూటి మాయాంబాయెరా నీ లోపల బాట దెరసి చూడరా । కోట కోటకు దృష్టి కుదురుగ నిల్పియు । మాటు బెట్టి యెక్కు మార్గంబు యిదే జీవా ॥గో॥ 5. మర్మంబు దెలుసుకో అవధూత నిర్మలానందుని జేరుమురా । నీ లోపల ధర్మంబె విడబోకురా । చర్మంబుపై నీవు పద్మాసనంబేసి । చక్కగ గురి నిల్పు భ్రూమధ్యమందున ॥గో॥

## 41. తత్వం—యెమున కళ్యాణి—ఆది

1. మంచి మాటలు బల్క మనసొప్ప దెన్నడొ । మాట వచ్చిన మూగ మనిషి గాదె ॥మ॥ 2. చెవులు వినబడియు వేదమాటలు విన్న।చెవులు వుండియు కూడ చెవిటి గాదె ॥మ॥ 3. కన్నులుండియు కూడ వెన్నెల నెరుగని బ్రతుకంత గ్రుడ్డి బ్రతుకు గాదె ॥మ॥ 4. చేతులుండియు కూడ చేతులెత్తని వాడు ।

## 45. తత్వం-కాఫి రాగం-ఏక

1. నాటకమే చూడరా । ఈ ఘటములో ॥నా॥ ఆటలాడును గజ్జెలు గట్టుక సీటి బుగ్గయని నిల్వదు మనసు । కాటిలో బెట్టుట యెరుగదుగా ॥నా॥ 2. ఆలుచుట్టమని అక్క చెల్లెలని । అధిక । భాగ్యంబని భ్రాంతిలో బడియె కలలోభోగము అనుకోక ॥నా॥ 3. చాలగ మరియును కీలుదెల్యక । కాలుని చేతిలో కట్టబడును । మేలుగ బెంచిన దేహము విడచి ॥నా॥ 4. మన వారెవరో మంచిగ వినుము । తనువు విడిచె తరుణములోన । తన వారెవరొ కనుగోవె ॥నా॥ 5. నిజము దెల్పెను అవధూత నిర్మలానందగురిచే దెల్యుడి। అజరుద్రాదులం కందని పదవి ॥నా॥

## 46. తత్వం—ఆనంద బైరవి—ఆట

1. నరుడ యెరుగవేరనీవు । ధరణిలో పరిగీడ బోకను పాటిగ వినుమా । శిరము క్రిందికి బెట్టు త్వరగ । సూర్యచంద్రుల త్రిప్పియు శరణనుము వేగ ॥న॥ 2. పద్మాసనం బేయు పైన । నీవు । ఆధారమంతయు అతి లాగిపట్టి । బొగ్గపులుసు గాలి దీసి వేగ । కుంభకంబును జేయు సంచర పడుచు ॥న॥ 3. చూపులో చూపును చూడు । కను । పాపలనాపితె యేమి లేదన్న । అందుట కష్టంబురన్న ఇది । అందరికి భువిలోన సందుదిడ్డన్న ॥న॥ 4. ఉచ్ఛ్వాస నిశ్వాస నెరిగి । మనసు । ఆశలో బోకుండ అణచి పారేయి । సోహంబు నీలోన చదువు నరుడ । మోహ గుణముల విడచి సోహంబె మరువు ॥న॥ 5. ఇరువదైదు పంచి చదువు । నీలొ । గురు రహస్యం భేరిగియు స్థిర చిత్తు గమ్మ । తోలు బొమ్మలొ నీవు చూడు కీలు అవధూత నిర్మలానందుని జేరి ॥నా॥

## 47. (గమ్ దియే ము స్తకిల్ అనుమాదిరి)

1. రెండు గుండ్లయందు । కొండ నడుమ ముందు । వుండెసందు—దండిగా దెల్సుకో జన్మమందు ॥రెండు॥ వుండె గుండ్లాగ్రమందున తూటు । గుండ్ల యందెరుక బుట్టేటి చోటు । రెండు గుండ్ల మాటు । మొండి వాడ దాటు—నిండు మందు ॥దం॥ ॥రెండు॥ 2. జోడు శ్వాసల మార్చుచు గలుపు। మాడపై దృష్టిబెట్టియు నిలుపు। ఈడ పింగళాపు। మాడవేడి బాపు—ఔను ముందు ॥దం॥ ॥రెండు॥ 3. నాభిలోపలి కిడ్చియు నీవు । నాభిలో మర్మ మెరుగుము లావు—నీ భయము విడువు—గాలి మ్రింగ నేర్వు—భుజనయందు ॥దం॥ ॥రెండు॥ 4. ప్రాణా పాణంబు యేకంబు జేసి—మౌన మందున మదినిల్పివేసి—తాను

క్రోధమిడసి–వీణనాదం మరిచె–మరుగు మందు ॥దం॥ ॥రెండు॥ 5. బాల అవధూత నిర్మలానందు–భావ మందున త్రికూటి సందు । కీలు దెలిపె యిందు–చాల మేలు విందు–రారా ముందు ॥దం॥ ॥రెండు॥

### 48. తత్వం–ఫీల్ రాగం–ఆట

1. ఎన్ని జేసినగాని తృప్తిలేదన్న । అన్నినాయనిజెప్పి పోతావురన్న । పొల్లు గింజల వంటి ఈ భోగమన్న । ఉల్లమందున చాల పుత్త్ర భ్రమలన్న ॥ఎ॥ 2. తేనెను త్రాగెటి తుమ్మెద విధము । తానెవరో తెల్యావు । మత్తులో మునిగి । సంసారమనె మోహం । తీరని దాహం । మాంసంబు కాయంబు నాదనుచె ద్రోహం ॥ఎ॥ 3. మంచుబిందుపు భంగి కెంచిద్భోగమురా । పంచి చూచిన నీలో యేమిలేదురా । అవధూత నిర్మలానందుని జేరి । ఆమర్మమెరిగితె ఇంకేమి కోరి ॥ఎ॥

### 49. తత్వం–ఫరజు రాగం-ఆట

1. ఏడు మెట్లల్లో నడిచె ఆపదెవ్వరొ తెల్యరా । జోడు బాయక తల్లి పిల్లలు కూడి చచ్చేదినుమురా ॥ఏ॥ 2. అర్థరాత్రి చూడుము బుడుబుడుకలోడు వచ్చెరా । అర్థ మెరిగిననీకు పదినాదములు వినిపించురా ॥ఏ॥ 3. పట్టపగలె నీకు వెన్నెల దిట్టముగ గనిపించెరా । గుట్టు దెలసిన రాగి చెట్టులో పిట్టలైదు వుండెరా । 4. లెక్కలెని చుక్క లెన్నొమక్కువాతో వచ్చెరా । చక్కని సూర్యచంద్రబింబములు కనిపించెరా ॥ఏ॥ 5. పిచ్చివాడి మాటలెల్ల చచ్చుదాక వినుమురా । ఖచ్చితం అవధూత నిర్మలానందుని బోదెరుగరా ॥ఏ॥

### 50. తత్వం–ధన్యాసి రాగం–ఆట

1. కామముచే నిండి నీవు పామరత్వ మిడక । మాయచాటవు మర్మము దెలియక మనుజుడ వినవేర ॥కా॥ 2. పంది విధము నీవు పొట్ట నింపుకొనియు । అందుడవై పర స్త్రీల వెంబడదిరిగి చెడెద వేల ॥కా॥ 3. కాయములో జూడు యిపుడు న్యాయమెరిగి నేడు। సోహంభజనచే నేమముంచిన రక్షించు గురుడు ॥కా॥ 4. యెందరో బోయిరిరా ముందట బొందలో బెట్టెరురా । అందమైన ఈ దేహము జూచి ఆగముగాకుమురా ॥కా॥ 5. బాల అవధూత నిర్మలానందుడు చాలగ జెప్పెనురా । మేలుగాను ఈ వాక్యము విన్న చాల మంచిదీర ॥కా॥

### 51. తత్వం–బారువ రాగం–ఆది

1. నిజ పూజ చేయరె వచ్చినరులు । మన గురుపూజ ॥చే॥ పూజచేయరె నిజ భోవ దెల్పిన వార్కి । సుమములందరు గూర్చి జాజి పుష్పములతో ॥ని॥

2. చిత్తైకాగ్రత గలిగి తూర్య పదవిలో వుండి। నిద్యానందము తోడ ద్వందతీతునికిపుడు ॥ని॥ 3. ఇంద్రియముల నణచి సందేహమ్ముల్లి విడచి। శుద్ధాత్మలో మనసు స్థిరము పరిచిన వార్కి ॥ని॥ 4. సర్వభూతములాను సమముగా జూచియు। నిర్వికారుని త్రోవ మరుగు దెలిపిన వార్కి ॥ని॥ 5. జీవన్ముక్తుడయి జిహ్వాను పైకొత్తియు। బాల అవధూత నిర్మలానందునికి ॥ని॥

52. తత్వం—రేగుప్తి రాగం—ఆది



1. కుజన మానవులను బిలచి। నిజ। భజన చేయుమంటె వినరు। ఆజనుల సుద్ధులు ఈ జనుల సుద్దులు। వమరుట కిష్టంబు అధమాధముల కెంతొ ॥కు॥ 2. దొంగ మానవులకు నీతి భోద। సంగతి జెప్పితె చేదు। దొంగ మహిషంబుకు దుడ్డు గట్టిన దాని। సంగతి మరువాద్దు సత్యంబు నడువాదు ॥కు॥ 3. పేడలొ మెదిలేటి పురుగు। తేనె। బెల్లంబు తెవెరుగ కష్టం మూడ మనుజులంత భావంబు లోపల భగవంతుని భక్తిచేయుటే కష్టంబు ॥కు॥ 4. గ్రుడ్డి వాని ముందు అద్దం బెట్టి। దొడ్డదని జెప్పిన విధము। చెడ్డవాని కెంత నీతి భోదించిన నీచపు పనులెల్ల మానుట కష్టంబు ॥కు॥ 5. భువి యందు వెలసిన ముధకుపల్లి। యందు నివాసుడై భోదించె మనకు। అవధూత నిర్మలానందుడు మన కొరకు। అనుభవంబు తొజెప్పె తప్పులు బట్టకుడి ॥కు॥



53. తత్వం—బైరవి రాగం—ఏక



1. వినవే పాపి మనుసా—వింటె నిలచు హంస। తనలో ప్రాణ పాణంబులను నిల్పు గడసా ॥వి॥ కొనముక్కుపై దృష్టి ఘనముగ నిలిపి—ఆదె ॥ఘ॥ కనులు అర్థము జేసి కనవేర మళిపి —నీ—కనుబొమ్మలా నడుమ పసిపాప నూపి ॥వి॥ 2. మందిరంబుల దాటు రంధ్రముల మూసి—నవ ॥రం॥ చంద్రగోళములింద్రధనుస్సుల జూచి—ఆ—సుందరమైనట్టి పురుషులా జూచి ॥వి॥ 3. మాణిక్య వజ్రాలు అగ్ని మంటలురా ॥అ॥ కాసవచ్చిన గాని కదులు ముందటరా—ఈ న్యాయంబులో వుండి గురి నిల్పవలెరా ॥వి॥ 4. మూడు నదుల చోట ముందు ఓ మనుసా—అందు ॥ఓ॥ చూడ చూడగ గాయుపండు వెన్నెల—ఇది మరుగైన క్షణమందె బయలు ఓ హంస ॥వి॥ 5. అవధూత నిర్మలానందుని మాట—ఆ ॥నం॥ భువిలోన నమ్మిన ముక్తికే—బాట—భవబంధముల త్రుంచి రక్షించు తేట ॥వి॥

54. తత్వం-సురట రాగం-ఏక

1. మనసులో కొంచెము ఆలోచించుము మానవ నీ లోన। మన మెక్కడి వారలమో యోచన మంచిగ జేయుమురా ॥మ॥ 2. వచ్చెటప్పుడు

వట్టిగ వస్త్రివి పోయ్యేటప్పుడు పోల్లేరా । ఖచ్చితముగ యీ కల్ల జగంబులో కానక తిరుగకురా ॥మ॥ 3. నాడి నీదని వదురబేగానియేది నీది జెప్పు । భేదమేలరా వాదము విడచి భోదె దెల్యవేరా ॥మ॥ 4. పుట్టక ముందు గిట్టిన పిదప యేమిలేని మాట । ఇట్టి మధ్యలో వట్టి భ్రాంతిలో మునిగి పోతివాట ॥ మ॥ 5. ధర్మమార్గము బోధజేసెను మార్గము గనవేర । అవధూత నిర్మలానందుని నీతినిజము నిజము వినరా ॥మ॥

## 55. తత్వం—(ఉంచి ఉంచి దునియకే దీవారె అనుమాదిరి)

1. వట్టి వట్టి మాటలు నేర్చి—వదిరేటి మూఢుడా—వోరిమూఢుడా—మరి చెడకురా—ఇవి పని జేయవు నీకు తుదకురా—మరి చెడకురా-ఇవి పని జేయవు నీకు తుదకురా ॥వ॥ హంసంబువినె రాకాసులురా—పర—హంసలమని బోధింతురురా హింసజేయుమ సంశయ మిడకను—హంసను మరచుట యేలరా—మది నిలుపురా మరి చెడకురా ఇవి పనిజేయవు నీకు తుదకురా ॥వ॥ 2. గడ్డమురా బొడ్డాన గరా—ఆ—బుడ్డెడు కల్లుత్రాగుచురా—దొడ్డ వారంబని దోషంబె లేదనుచు గ్రుడ్డిగ దిరుగుట యేలరా—మది నిలుపరా—మరి చెడకురా—ఇవి పనిజేయవు నీకు తుదకురా ॥వట్టి॥ 3. ఉప్పు కారమురా—మరి మానినరా ఉపవాసంబులు యెన్నున్ననురా । గొప్పగ మౌనములో—యెప్పుడు వుండినా—చప్పుడు లోపల బోకను—అది విడకను మరి చెడకురా—ఇవి పనిజేయవు నీకు తుదకురా ॥వ॥ 4. గురు మాటినురా గురై రుగుమురా—గురు మర్మము దెలియుట కష్టమురా-అవధూత నిర్మలానందుని మాటివి—పరతత్వ మెరుగర మూఢుడా—దరిజేరరా—మరి చెడకురా—ఇవి పని జేయవు నీకు తుదకురా ॥వ॥

## 56. తత్వం—కళ్యాణిరాగం—ఆది

1. గుణమేయింతాయెగదా మనిషి । జీవితాంతము వరకునీ ॥గు॥ సుగుణములవర్చుకొన ప్రయత్నించక ॥నీ॥ 2. వినయముతో వినుతన తనువు క్షణములో । కనుమరుగౌనుగనుమనిషి ॥నీ॥ 3. ఎంతని జెప్పుదు యేమని జెప్పుదు । యింతనన్న మారవు పంతమువిడువక ॥నీ॥ 4. పెద్దల వాక్యము పెడచెవిబెట్టియు ।నీచ। సుద్దులలో నిమగ్నమయ్యేదవు ॥నీ॥ 5. సత్యాసత్యముల విచారహీన్యుడవై । నిత్యానందమగు నిలకడ శేకను ॥నీ॥ 6. ఎరుకకాలములో సుగుణుడవగుము । పరిపూర్ణధ్యానములో సుఖదుఃఖముల విడువుము ॥నీ॥ 7 ఘనముగ అవధూత నిర్మలానందుడు । నినునీవు యెరుగ ప్రయత్నించు కొమ్మనినా ॥నీ॥

## 57. తత్వం-గౌలన్ రాగం-ఏక

1. నమ్మితి నిన్ను యిమ్మహిలోన । స్వామి బ్రోవగరావ । అమ్మవు నాన్నవు నీవె ॥న॥ 2. భక్తులనేలె ప్రభుడవు నీవె। శక్తికొలది పూజింతు-రావ-ముక్తిచేతమము బ్రోవ ॥న॥ 3. ముగ్గురు మూర్తుల వేల్పువు నీవె । వేగమే కరుణించరావ । చేతు । లొగ్గితి కరుణించు దేవ ॥న॥ 4. చీకటి కావల వెలుగును జూపి-ఆ కాంతిని కనుమరుగు జేసి-దేవ-చీకటి-వెలుగుల బైట నిలచె ॥న॥ 5. అవధూత నిర్మలానంద స్వామి-ధర్మమూర్తివని మర్మము దెలసె-బ్రోవ-గురుమూర్తియిటు రావ ॥న॥

## 58. తత్వం-రేగుప్తి రాగం-ఆట

1. శిశ్నముకు గుదమునకు మధ్య త్రికోణముండును । శ్రీ విఘ్నేశ్వర భూముద్ర వ, శ, ష,స వుండున్ ॥శి॥ (న) 2. దీనికి రెండంగులంబులపై స్వాధిష్టాన ముండును । దీనిలో బ, భ, మ, య, ర, ల యుదక ముద్ర యుండును ॥శి॥ (మ) 3. ఎనిమిదంగుళములపై మణిపూరక చక్రముండును । వినుము డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ అగ్ని ముద్రయు ॥ శి ॥ (శి) 4. పది అంగుళములపై అనాహ చక్రము వాయుముద్రయు క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట ఠ వుండును ॥శి॥ (వా) 5. దీనికి పన్నెండగుళ ములపై విశుద్ధ ముండును । అ ఆ మొదలు అం అః దాక వుండును ఆకాశ ముద్రయు ॥శి॥ (య) 6. దీనికి పది అంగుళంబులపై ఆజ్ఞేయ చక్రము । తను బొమ్మల మధ్య హంక్షం ఇదె మనసు ముద్రయుండును ॥శి॥ (ఓం) 7 మరుగు గనుము దీనిపై సహస్రారముండును । గురుముద్రయు వేయి రేకుల పద్మ ముండును ॥శి॥ (రాం) 8. ఇన్ని దాటి మేరులోన మేను మర్మము । సున్నె అవధూత నిర్మలానంద దెల్పెను ॥శి॥

## 59. తత్వం-బీమ్ప్లాస్ రాగం-ఆట

1. కంటిలోన జూడరా వొంటి స్తంభము మేడరా । అంటి అంటక నుండె బ్రహ్మము ఇంటిలో నిండుండెరా ॥కం॥ 2. కుడి యెడమ శ్వాసరా మార్చి మార్చి తెల్యరా । కుడి యెడుమ మధ్యనున్న కోమలాంగిని గూడరా ॥కం॥ 3. మూడు దారులు గలిసె చోట మూలంబు నుండెరా । ఆడుచున్న ఆడిదానిలో అర్థంబె నుండెరా ॥కం॥ 4. రెండక్షరంబులాతొ నిండుకూడుండురా । పండు వెన్నెల జూచి భ్రమసి పడిపోక నిల్వరా ॥కం॥ 5. నిర్మలంబుగ మనసు వుంచి ధర్మరబె నడుపురా । అవధూత నిర్మలానందుని మాట విడకురా ॥కం॥

## 60. తత్వం–కళ్యాణి రాగం–ఏక

1. ఎవరేమన్న యేమి దెల్వదు । యేమి లేదురా ఓరన్న । యేమి లేని ధ్యాన్నె యెరుగక వ్యర్థపు తర్కము యేలన్న ॥ఎ॥ 2. ప్రాతకంద నాత్మబోధ ప్రాసిరి తెల్వక । నూతనంద నాత్మ గురియు నిల్పి అందినంత వరకు సద్గురు కృపవల్ల ఆత్మబోధ జేతు అన్నమిన్న ॥ఎ॥ 3. ఎవరి తపసు భావమెట్లు చెప్ప గలము భువిలో భక్తుల వరుస బుద్ధి వినుడి । ఎవరికెట్ల దోస్తె యెరుక జెప్పిరి అంతెయేమి జెప్పవలెను । యేమిలేదు ॥ఎ॥ 4. సోహందెలసి సోహం విడచి సొక్కి పొమ్మురా । ఓరన్న । సోహం నడిచె నాసిక మందున । శోధించుము సోద్యమురన్న ॥ఎ॥ 5. మర్రి చెట్టుపై చిలుకలు రెండు మలిపి కలుపర వోరన్న । మలిపి కలిపిన కాకకు పాము మర్రిచెట్టు కొనలుండన్న ॥ఎ॥ 6. కోతి తోకపై కూర్చుండి కొండలెక్కర వోరన్న । భీతి లేక అవధూత నిర్మలానందుడు చెప్పెను వినుమన్న ॥ఎ॥

## 61. తత్వం-యమున కళ్యాణి-ఏక

1. వాయు భక్షణ జేసియు నీవు। నిద్ర అన్నము పానముమాని। కాయములో వాయువుకుంభించు । కుంభించి నీవు । ఉపాయముతో సమాధి నొందుమురా ॥కుం॥ ॥వా॥ 2. తప్పక అభ్యాసము జేయు। కడుపు యందున వాయువు జేరి। కప్ప విధము అరచును దిరుగాను । ఉష్ణము లావయ్యి । గొప్పగా చెమటాలు బుట్టును ॥ఉ॥ వా॥ 3. నరములందు వాత్తికి జోరై । శిరము నుంచి వ్రేళ్ళ వరకు । పరుగీడు చుండే సమయము । ఆ గాలియునీ కండరముల కదలిక జేయును ॥ఆ॥ వా॥ 4. నెమ్మదిగ నీ ప్రాణము నాపి । నమ్మర నీ చూపులు నిలిపి । ఝుమ్మురఝుమ్మని తుమ్మెదల మ్రోత । వినిపించు సుమ్మ । ముమ్మారు చెవుల యందున ॥ము॥వా॥ 5. బాలయోగి అవధూత నిర్మలానందుడు నీకు । చాలగ వర్ణించి చెప్పెను । మేలైన బోధచె । గాలి నిలచిన మనసు నిలచును ॥మే॥ మనసు నిలచిన గాలి నిలచును ॥మే॥వా॥

## 62. తత్వం-భైరవి రాగం-ఆది

1. దేహము లోపల దేవుని దెలసితె । మోహ గుణములే లేవు । నీలో కామ గుణములేరావు ॥దే॥ 2. మౌనము లోపల మనసు నిల్పియు । ధ్యానామృత మున్గ్రోలు మహా ఆనందంబులో మునుగు ॥దే॥ 3. యోగ భ్యాసము విడువక జేసితె । రోగబాధలేలేవు । నీకుభోగ కాంక్షనేరాదు ॥దే॥ 4. నాసిక మందున

దృష్టిని నిలిపి । నాతిని యెరిగి నీవు । నిజభజన జేయుములాపు ॥దే॥ 5. అవధూత నిర్మలానందుని । భావము యెరుగుముముందు । ఆయెరుకను మరచిన సందు ॥దే॥

63. తత్వం-సావేరి రాగం-ఆట

1. చిన్నదాన వయ్యి వుండియు ఓమాయ మనసా । ఎన్నో పనులు జేయించు చుంటివే । చిన్నదాన వయ్యినీవు యెన్నొ దిక్కులదిరుగు చుంటివి । యెన్ని విధముల జెప్పిన నీవుయేమి యెరుగవు మరుగవిందు ॥చి॥ 2. గుదమున కాలుబెట్టవె పదిలంబుగను । సిద్ధాసనంబు వేయవే । సిద్ధాసనంబు వేసెనాబిలోపలి కేడ్చి మెల్లగ । జిహ్వాను బందించి నీవును ప్రాణమును పైకెగరించు ॥చి॥ 3. పెట్టెతొమ్మిది దార్లు బందించు పెకిలించి గట్టిగ । వట్టి మాటలు గట్టి పెట్టుంచు । గుట్టు దెలసియు పదవ ద్వారము పట్టువిడువక తెరువుసుమ్మ పడిగె లేని నాగుపాము పరుగుదీసి మాయ మౌను ॥చి॥ 4. ఆరు చక్రంబు లఆవాల తప్పకను నీవు । ద్వారమొక్కటి దాటి చూడవె । ద్వారమొక్కటి దాటి నీవు మేరులోన మేరు మరచి। నిర్వికారునిలోపల నిజ ముగానులయము జెందు ॥చి॥ 5. నాభి యందలి మూడు। మూలాల ఆలోచించి। పెట్టెగుట్టు విప్పగట్టిగను । పెట్టెగుట్టు విప్పిచూచితె వట్టిదాయె భ్రాంతిబాయ ।యేడు కోటలు యేకమాయె యేమి లేకుం పైపాయ ॥చి॥ 6. డెబ్బై రెండు వేయిల నాళ్ళు తనలో జూచిన । బొబ్బపెట్టుచు సంగమయ్యెనె । అబ్బ దీని మహిమ దెల్యుము అందరిలో వున్నసంగము । అన్నినాళ్ళ కట్టుబడుతానున్న చోటు తెలసి మరిసితె ॥చి॥ 7. కన్నులాపియు అన్నిదాటవె గురినిల్పి నీలో । నిన్ను నీవె మరిచి పొమ్మింక । తెల్ల గుడ్లు త్రిప్పితాను వొంటిగెల్లు సమయ మందు । కల్లగాదు యెట్టులుండెవొ అట్లె నీవుగమ్ము ఇచ్చట ॥చి॥ 8. అవధూత నిర్మలానంద తత్వంబు మాటలు । ఆలోచన జేసి చూడవె । చర్మమందు గూర్చుండి నాలుగు స్తంబాలదాటి । మర్మంబు దెలుసుకొన్న కర్మలన్ని కాలి పోవును ॥చి॥

64. తత్వం—ఆనందబైరవి రాగం—ఆది

1. సాధారణముగ మాట్లాడునప్పుడు శ్వాస । పదాహారంగుళములు బయట ఆడు । మోదంబుతోడను యెనిమిదంగుళములు లోపల బోవును బ్రహ్మ మెచ్చ ॥సా॥ 2. నడచునప్పుడు పధాహారంగుళములు బయట । యెనిమిదంగుళ ములులోపట । నుడివితి చేతి పనులు జేయు కాలంబు ఇరువై బయట వచ్చి పదిలోపలికిబోవు ॥సా॥ 3. వివాదమాడునప్పుడు యిరువైనాల్గు అంగుళములు

బయట ఆడుసుమ్మ । భావంబులో యోసించి చూసుకొనుము పన్నెండంగుళ
ములలో బోవును ॥సా॥ 4. నిద్రబోవు కాలంబు నలుపై యెనిమిదంగుళములు
బయట ఆడు । భద్రముగ యోశించుముప్పైఅంగుళములు లోపల బోవును
ముసుమ్మ ॥సా॥ 5. పరుగెత్తె కాలంబు యాభై నాలుగు అంగుళములు బయట
ఆడుసుమ్మ । సరగున దెలుసుకొ ఇరువై యేడంగుళములులోన బోవు సుమ్మ
॥సా॥ 6. సంభోగ కాలంబు అరువై నాలుగుబైట ఇరువై నాలుగులోన బోవు
సుమ్మ । సంబరంబుతో బాలయోగి అవధూత నిర్మలానందుడు దెలిపెనన్న ॥సా॥

## ౬౫. తత్వం—నాదనామక్రియరాగం—ఆట

1. ఒక విషయమును గూర్చియు । మాట్లాడెటప్పుడు । తికమక పడ
కుండాను । శ్రద్ధాతో యెపుడు । వొకటి కూడ మరువకుండ జ్ఞాపకముంచు
కొనునదె । జాగ్రత్తలోని జాగ్రత్తయని పెద్దలెల్ల బలికిరి ॥ఒ॥ ఒక విషయిమును
గూర్చి మాట్లాడే సమయమందున । చకచక నీ మనసు కొంత నిలచినిల్వక
యుండుచేయవి । జాగ్రత్తలోని స్వప్నంబు । ఇంక వినుము అట్లే మాట్లాడు
సమయంబు । శ్రద్ధాతో వినిగ్రహించ లేక పోవుసమయంబు । జాగ్రత్తలోసుషు
ప్తియని బల్కితినిజము । జాగ్రత్తతో ఒక విషయంబును గూర్చి రోరన్న ।
శ్రద్ధతో వినిదాన్ని గూర్చి యోశించుటె జాగ్రత్తలో । తూర్య పదవని తెలుసు
కొనుము బధులెల్ల మెచ్చునటుల ॥ఒ॥ 2. కలలో గనిన విషయమంతయు మేలు
కొనిన పిదప పరుంకు । మరువకుండను తెలుపునదియే స్వప్న మందలి
జాగ్రత్తని । తెలుసుకొనుము నేర్పుతోనన్న । స్వప్నములో దోచిన విషయ
మంతయు లేచిరోరన్న । కొన్ని మాత్రము చెప్పుచు మరచినను వోరన్న । ఇదె
స్వప్నమందలి స్వప్నంబని తెలుసుకొనుమన్న । స్వప్నమునందున విషయము
మరచిన రోరన్న । స్వప్నము నందలి సుషుప్తని యుందురోరన్న । స్వప్న
ఫలితము దెలుసుకొని । సుఖ దుఃఖములను రెంటిని విడచి । నిశ్చల మనస్కుండై
యుండుటే స్వప్నములో తూర్యము ॥ఒ॥ 3. నిద్ర నుండి లేచి దాని వలన
గలిగెన మంచి చెడ్డల । భద్రముగ చెప్పుకొనుటయె । సుషుప్తిలో జాగ్రత్తయని।
తెలుసుకొనుము తెలివి చేరన్న। నిద్ర సుఖము నెరిగి మరల నెరుగ కుండుటయే।
సుషుప్తందలిస్వప్న మందురు యెరుగుమురన్న। గాఢముగ నిద్రపోయి మేల్కొ
నినపిదపన్న ।అజ్ఞాన విషయమని బహుల తెలుసుకొనుటయే సుషుప్తిలో । తూర్య
పదవని పెద్దలెల్లరు తెల్పి యుండిరి నిజముగాను ॥ఒ॥ 4. యోగ నిష్ఠయందు
ఆకలి దప్పి యుండి కూడ తనకు । దోచకుండుట తూర్య మందలి జాగ్రత్త

యని దెలుసుకొనియు । యోగ నిష్ఠయందు రోరన్న । ప్రపంచ వృత్తులు దెలిసి దెలియక యుండుటారన్న । దీన్నె తూర్య మందు స్వప్నంబన బడురన్న । ఆ యోగమందె యే తలంపులు లేకరోరన్న । ఊరకుండుట తూర్యములో సుషుప్తి రోరన్న । ముందుదెలిపిన పదిహేనవస్థలు లేకున్న నిర్మలంబుగ తాను వుంటె తూర్యమందలి తూర్య పదవని । అవధూత నిర్మలానందుడు తత్వం బోధ జేసెను ॥౭॥

66. తత్వం-శివరంజని రాగం—ఏక

1. ప్రొద్దు పోతుంది వో నరుడా। ప్రొద్దు గూకెదాక నిద్దురయేలరా। మొద్దు నిద్దుర వలదురా। వద్దన్న వినవు వో వెట్టి నరుడా। సద్ది కుడువక ముందె ప్రొద్దు పోతాదిరా। పదిలపడవేమిరా ॥ప్రొ॥ 2. పట్టుబడిన బోయ వలలో పిట్ట । యెట్టులైన కోతకు పోతాదిరా। గుట్టు దెల్యవేరా ॥ ప్రొ॥ 3. దండి మ్రానుకు పండుటాకు విధము । చూడ చూడగ రాలి పోతాదిరా । నేడొ రేపోనురా ॥ప్రొ॥ 4. యేటి లోన నీటిబుగ్గ విధము। యెరుగవేర మటు మాయంబురా । యేమి మిగులాదురా ॥ప్రొ॥ 5. పాము కూసమిడి పోయినట్లుగా । పారిపోవు జీవి యెరుగవేర । పదిలపడవేమిరా ॥ప్రొ॥ 6. బాలయోగి అవధూత నిర్మలానందుడు బోధించె దెల్యవేరా । మేలుబొందుమురా ॥ప్రొ॥

67. తత్వం—నాదనామ క్రియరాగం—ఆది

సోమ, బుధ, శుక్రవారంబులు యివి చంద్రవారములు వినుమయ్యా । ఓ మానవుడ ఆది, మంగళ, శనివారములు సూర్యునివి ॥సో॥ 2. అమవాస్య గురు వారములందు సూర్యనాడియని తెలియుమయా । నేమము దప్పక పౌర్ణిమ దినములు చంద్రవారములు తెల్యుమయా ॥సో॥ 3. ఉగాది అమవాస్య రాత్రి సూర్యనాడినీ కాడ వరెన్ । ఉగాది పౌర్ణమి ఉదయంబున చంద్రసాయంత్రమున్ ॥సో॥ 4. విదియ రోజున ఉదయము చంద్రసాయంకాలము సూర్యుండు। తదియ రోజున ఉదయము చంద్ర సాయం కాలము సూర్యుండు ॥సో॥ 5. ఈ ప్రకారము చంద్రుడాడిన వొక్కొక్కదినముకు నాల్గునెళ్ళ। ఏ భీతి చింతలు లేకను సంవత్సరము హాయిగనుండు ॥సో॥ 6. వినుము పాడ్యమిరోజున చంద్రుడు ఆడక పోయిన ధననాశనం । కనుగొను తదియ చంద్రుడు లేక భయ భీతులు బహు గల్గునయ ॥సో॥ 7. కానవేర చవితి రోజున వారస్వరంబు లేకున్న । ప్రాణ మిత్రులతో సమమైన చుట్టములకు భయము వచ్చు సుమ ॥సో॥ 8. పంచమి రోజున వారస్వరంబు ఆడకపోయిన రాజులతో । మంచిగ మెసలిన విరోధము బహు గల్గుచుండు ఇది నిక్కమయ ॥సో॥ 9. షష్టి రోజున

వార స్వరంబు అడక పోయిన రోగంబున్ । కష్టముతో విను సప్తమి వార స్వరము లేక ప్రాణహానిరా ॥సో॥ 10. అష్టమి రోజున వారస్వరము అడక పోయిన ప్రాణహాని । కష్టంబనకను బాలయోగి అవధూత నిర్మలానందుడు దెలిపెను ॥సో॥

68. తత్వం-కమాన్ రాగం—జంపె

1. ఉగాదినాడు తత్వము జూచుకొనెదిట్లు వినుము ॥ఉ॥ ఉదయమందు నీకు తేజ తత్వంబుంటె । ఆ సంవత్సరంబంత వర్షంబు బహు తక్కువ ॥ఉ॥ 2. వాయుతత్వము నీకు ఆనాడు ఆడిన ఆయురారోగ్యము లేక రోగ బాధలు వుండు ॥ఉ॥ 3. ఆకాశ తత్వంబు ఆడుచుండిన నీకు । రోగబాధలు లేని వుప ద్రవములు బుట్టు ॥ఉ॥ 4. పృథివి తత్వము నీకు అనాడు అడినా । ప్రజలు సుఖ శాంతులతోను వుందురు ॥ఉ॥ 5. జల తత్వంబు నీకు ఆనాడు ఆడిన జగడాలు లేకుండ సుఖశాంతులుండును ॥ఉ॥ 6. అమవాస్య పాడ్యమి విదియ తదియ చంద్రు । డాడిన నెలయంత సుఖ శాంతులుండును ॥ఉ॥ 7. బాలయోగి అవ ధూతనిర్మలా । నందుడు దెలిపెను బాగుగ యోచించు ॥ఉ॥

69. తత్వం—నాదనామ క్రియరాగం—ఆది

1. సంవత్సర మాస పక్షాది దినముల్ । చక్కగ వారస్వరముంచేనె జయముల్ ॥సం॥ 2. విపరీతముగ నడుచు చుండిన వినుము । విపరీత ఫలమని యెరుగుము ముందు ॥సం॥ 3. ఉగాది నాడు దినస్వరము లేకున్న । ఉందువు మూడు సంవత్సరములన్న ॥సం॥ 4. రెండవ దినంబు లేకున్నరన్న । రెండు సంవత్సరములుందువురన్న ॥సం॥ 5. మూడో దినంబు లేకున్నరన్న। యాడాది లోపల మృత్యువేరన్న ॥సం॥ 6. పదిహేను దినములు సూర్యనాడన్న । అది మారక రెండేండ్లుందువన్న ॥సం॥ 7. రాత్రంతా చంద్రుండు పగలంత సూర్య। యాత్రజేసిన ఆరు నెళ్ళుందువన్న ॥సం॥ 8. బాలయోగి అవధూత నిర్మలా । నందుడు జెప్పెను బాగ వినుమన్న ॥సం॥

70. తత్వం—ఝుంఝుంటి రాగం—ఆట

1. ఎడమ కాలిపై । కుడి కాలువేసి । కూర్చుండుము ॥ఎ॥ మడిమె దగ్గఱనున్న । పెద్ద నరమునటు నిటు కదల్చు । యెడుమ చేతునూదబొడచి । తడబడకు రెండు మూడు నిమిషములలో సూర్యుడౌను ॥ఎ॥ 2. కుడి కాలుపై । యెడుమ కాలుబెట్టి । కూర్చుండుము ॥కు॥ కుడి చేతునూద బొడిచి । యెడుమ కాలు పెద్దనరము । కొడుక నటునిటు కదల్చిన చంద్రుడౌను ॥ఎ॥ 3. పరుండు నప్పుడు । కుడివైపున । పరుండి ॥ప॥ మరువకుండ కుడి చేతు నీ తల క్రిందను

వుంచు కొనుము । తిరుగు కుడి ముక్కు నుంచి । యెడుమ ముక్కులోన శ్వాస ॥ఎ॥ 4. ఎడుమ చేతుని । తల క్రింద నుంచుకొన్న యెడల ॥ఎ॥ యెడమ ముక్కులోని శ్వాస కుడి ముక్కులోనదిరుగు । కడు ప్రేమ తోడ జేయు దిన స్వరంబు లేకయున్న ॥ఎ॥ 5. యోగదండను । యెడమ చంకలోన । పెద్ద నరము కొత్తిపట్టుము ॥యో॥ జాగు చేయకుండ కుడి శ్వాస మారిపోవు నిజము। ఇట్టె కుడి చంకలోన బెట్టిన చంద్రుడౌను ॥ఎ॥ 6. బాలయోగియు । అవధూత నిర్మలానందుడు ॥బా॥ మేలని యీ బోధ దెలిపె । కీలు దెలుసుకొని మెదలు । చాల పనులు జరుగుచుండు । ఈ శ్వాసతో నిక్కమయ్యె ॥ఎ॥

## 71. తత్వం-దర్బారు రాగం-అట

1. వినవే ఓ పాపి మనుసా । నీకు । ఎంతాని జెప్పదె గడుసా । అను మానమును విడచి । అహింస ధర్మంబు । ఘనముగ పాటించు కఠిన మెందుకె మనుసా ॥వి॥ 2. సత్యంబు బలుకవే మనుసా । ఇదియే । పత్యంబు అనుకోవే గడుసా । నిత్యంబు హరిశ్చంద్ర సత్యమాడుట చేత । ముత్యంబు వోలె తన జాతిని పాలించె ॥వి॥ 3. సద్గుణముల సమూహంబె మనుసా । నీవు । సంసా రంబని యెరుగు గడుసా । సద్గతి కోసమై సర్వగుణముల విడచి । శాంతి స్వభావముతో చక్కగ మెదులుము ॥ని॥ 4. ఎంతెంత జెప్పిన మనుసా । నీ । వింతైన వినలేవు గడుసా । చింతాలు విడనాడి త్రివేణి లోపల । అంతొ ఇంతొ మునుగు పంతంబు విడనాడి ॥వి॥ 5. ధర్మమార్గము విడకె మనుసా । నీలొ । మర్మంబు దెలుసుకో గడుసా। అవధూత నిర్మలానందుడు యీబోధ । ఆనంద ములో మనసు నిల్పుమని చెప్పెను ॥వి॥

## 72. తత్వం-నాదనామ క్రియ రాగం-ఆది

1. తనకు కీడుజేసిన । పరులకు మేలుజేయన్న । తనకు మేలు జేసిన వారికె మేలుజేయ గొప్పగాదన్న ॥త॥ 2. తనువు శాశ్వతముగాదని యెంచి ధనము తన వెంటరాదని తెలసి । ఘనముగ దేహాభి మానము విడచి । గండి దాటర వోరన్న ॥త॥ 3. కోపము లేక కోర్కెలు లేక। కొంపలో గుణములు సరుకన్న। యెప్పొద్దు గురి నిల్పియు గురుని। యేమారక పూజించన్న ॥త॥ 4. సత్పురుషుల సాంగత్యము చేత భ్రమలు విడువర ఓరన్న। సత్పురుషుల సంగతి దెలిసితె రాదిక జన్మము వోరన్న ॥త॥ 5. యేటింటిలొ మది నిల్పి ఆయేటిని దాటర వోరన్న। గూఢమర్మము గుట్టు విప్పెను। అవధూత నిర్మలానందన్న ॥త॥

## 73. తత్వం-శంకరాభరణం-రాగం-ఆది

1. భూమియందు దండాకారముగ రెండు । కాళ్ళను చక్కగ సాపుము ముందు ॥భూ॥ 2. కాళ్ళబొటనవ్రేళ్ళు చేతులతో బట్టు। మెల్లగ మోకాళ్ళపై శిర ముంచు ॥భూ॥ 3. గర్భరోగములను తగ్గించుచుండు ॥భూ॥ 4. వీరాసనము, పద్మ, సిద్ధాసనములు । మీరకుండను జేయు స్వస్తికాసనము ॥భూ॥ 5. మయూ రాసనంబు, గోము ఖాసనంబు । నియమంబు తప్పక కుక్కుట, శిర, సుఖాస నముల్ ॥భూ॥ 6. బాలయోగి అవధూత నిర్మలానందుడు దెలిపెను బాగ యోశించు ॥భూ॥

## 74. తత్వం-కనగాంగిరాగం—ఆట

1. కొమ్ముచెంబులో జలమునింపి కొద్దిగలవణంబేయుము నీవు ॥కొ॥ కొమ్మునుకుతి ముక్కురంధ్రంబులో పుంచి । సమ్మతమున నీనోరుదెరుపుము రన్న ॥కొ॥ 2. అప్పుడు యెడమ ముక్కు రంధ్రమునుంచి । వుప్పునీరువచ్చు చున్న కాలువ విధము ॥కొ॥ 3. ఇలాగె రెండురంధ్రములను గడుగుము । ఇల గోన యీ క్రియచె జలుబు తగ్గిపోవు ॥కొ॥ 4. నోరుదెరచుటమరచితివనీ కంఠ ములో నీరునిండిపోయి యిబ్బందిగలుగును ॥కొ॥ 5. అవధూత నిర్మలానందుడు దెలిపెను । అనుభవపరులచే ఆచరించుమురన్న ॥కొ॥

## 75. తత్వం-ఆభేరిరాగం-ఆది

1. కడుపుగడిగె విధము దెల్యండి । ప్రాణాయా మాభ్యాసపరులు ॥క॥ కడుపుగడిగెముందు కాలకృత్యములు దీర్చుకొని మీరు । పడిగడుపుతో వుప్పునీరు మోతాదుతో త్రాగవలయు ॥క॥ 2. సర్పాసనము పన్నెండు సార్లువేయవలయు। ఊర్ధ్వహస్తాసనము పన్నెండు సార్లువేయవలయు ॥క॥ 3. కటి చక్రాసనము పన్నెండు సార్లువేయవలయు । ఉదరాకర్షణము పన్నెండు సార్లుచేయవలయు॥క॥ 4. తెలియవలెను శ్వాసక్రియను తెలివిగలవోమనుష్యుడా! మలద్వారము వెంట తెలుపునీరు వచ్చేవరకు జేయుము ॥క॥ 5. అవధూత నిర్మలానందయోగీశ్వరుడు దెలిపె । ఆరోజు ఈక్రియ పిదప స్నానంబుజేయరాదని ॥క॥ 6. వినుము సంక్రాంతిగైకొను। నెయ్యివేసిన కిచిడి దినుము। తినకపోయిన కడుపులో వాయువు జేరికొప్పెబుట్టును ॥క॥

## 76. తత్వం-శహన రాగం-ఆది

1. వినవేవో మనసా ప్రాణాయామం । గనవేవోమనుసా । వినిముక్కు రంధ్రములో పరుగిడుచుండె । ఘనమైన శ్వాసతొ ఓం జేర్చుము ముందు ॥వి॥

2. శ్వాసనూదియు । కొద్ది కొద్ది గా నీవు మొత్తం । శ్వాసనుదీసి కొద్దికొద్దిగ మళ్ళి । శ్వాసకోశములను నింపిగాలిని మ్రింగుము ॥వి॥ 3. ఆ సమయంబు హృదయంబులో నింపినశ్వాస।ఆ సందుదిడ్డిలో చూపునునిల్పుచు। కుంభకంబును జేయ చెమటాలుబుట్టును ॥వి॥ 4. కడుపులో పెరుగు వార్లుమ శ్వాస । కడు వేడ్కతోను । తడబడకు క్రింద కూలినప్పటికైన । వేడిలాపైన భీతి జెందబోకు ॥వి॥ 5. బాలయోగి అవధూత నిర్మలానంద । మేలాని యీ బోధ యింపు తోడను దెలిపె । వాలాయంబుగ నీదు వాంఛలు తెగగోయు ॥వి॥

## 77. తత్వం-నాదనామ క్రియ రాగం-ఆట

1. నాల్గుసార్ల శ్వాసను వదిలి । మరల । నాల్గు పర్యాయములు శ్వాసను బీల్చి । మూడు గంటలు శ్వాసనాపి । తన । మాడపై దృష్టియు జోడుగ బెట్టి ॥నా॥ 2. నాల్గు అంగుళముల శ్వాసను వదిలి । మరలా నాల్గు అంగుళములు లోపల బీల్చి । మూల్గుడు విడచియు పెట్టు । నీవు శ్వాసను మార్చుచు ఊర్ధ్వ గతి నొందు ॥నా॥ 3. ఇట్టి కాలంబులో దేహం । వట్టి । కట్టెలాగ చిక్కిపోయి సట్లుండు । వట్టి మాటలు గానేగావు । పైకి । నరములు కనిపించు । బొక్కలు మిగులు ॥నా॥ 4. పట్టువదలకుండ నీవు। ఇట్టి గుట్టు లోపల నిష్ఠ జేయుములావు। పుట్టును ఓంకార శబ్దం । నీ కుడి చెవిలో మనసుబెట్టియు జూడు ॥నా॥ 5. నాదంబె శ్రేష్టంబుగాదు । యీ నాదమావలవున్న బయలులో గలుపు । మోదం బుతో దెలిపె వినుము । యీ అవధూత నిర్మలానందుని గనుము ॥నా॥

## 78. తత్వం-కాంభోజి రాగం—చాపు

1. నిర్వికల్ప సమాధి యందున యోగి । తనను । తాను మరచి పోవు నయ । సర్వకాలమందు బ్రహ్మానందములో సాక్షిలో సాక్షై యుండునయ ॥ని॥ 2. బాగుగాను యోగి వాయుభక్షణ జేసి। శ్వాసను నిల్పేసి వుండునయ । వేగమె ఆశ్వాస బొడ్డు లోపల నుండి । జాగు చేయక ముడ్డి చేరునయ ॥ని॥ 3. తేనెను త్రాగిన రీతి । మత్తులో మునిగియు । తానెవరో తెల్యకనుండునయ । గానంబు జేసెటి గాలి ఆగిపోతే। మనసు నిలచి పోవు ఆ మూలలో ॥ని॥ 4. బొడ్డు నుంచి తన మాడ వరకు । అడ్డుగోడ ఒన్ని పోయినయలౌను । కడ్డిలాగ నీ ముడ్డిని నిల్పి ।ఆ। తెడ్డుతో దిడ్డి పొడుపుమయ ॥ని॥ 5. బాలయోగి అవధూత నిర్మలా। నందుని భావమెరుగుమయ । కీలంత దెలుసుకో నీల మేఘము మధ్య పాలుత్రాగె పాప వుండెనయ్య ॥ని॥

79. తత్వం-మధ్యవతి రాగం-ఆది

1. వాయుభక్షణజేసి । అన్నపానాదుల్ । వాద భేదము మరచిమాని కూర్చుండుము ॥వా॥ 2. జాగ్రత్తస్వప్న సుషుప్తుల దాటి । గాఢాంధకారమనె గండినిదాటి ॥వా॥ 3. యోగ బలము చేత యోగాగ్ని బుట్టును । భోగ రోగ బాధబోవును వేగ ॥వా॥ 4. గాలిలేని దీపం కదలాని విధము । వాలాయంబుగ నీ మనసాగు నిజము ॥వా॥ 5. అంతఃకరణములన్ని నశించి పోయి । అవధూత నిర్మలానందుడై పోవు ॥వా॥

80. తత్వం-మధ్యవతి రాగం-ఆట

1. ప్రాణాయామము జేసి । కంఠము బాగుగా మూసేసి । మౌనమందు కుంభించి వేసి నీ మనసు నిల్పితే బహు సౌఖ్యంబు ॥ప్రా॥ 2. ఆ సమయంబు న । నీ । శ్వాస బయటరాక । శ్వాస సంచికె బయట వుండిన । అన్నము సంచిలో ప్రవేశించును ॥ప్రా॥ 3. కన్నోడ వినుము । ఆహార సంచినుంచి శ్వాస । చిన్నగాను ఆ ప్రేగులో జొచ్చియు । గుదము నుంచి వెడలు ॥ప్రా॥ 4. సిద్ధాసనమేసి కూర్చొని । పిఱ్ఱం బిగబట్టి । ముద్దుగ శ్వాస యెటు బోలేక । వెన్నెముకలోన జొచ్చు ॥ప్రా॥ 5. తొమ్మిది ద్వారములు మూసిన । తోలు బొమ్మలోన శ్వాస । బ్రహ్మకపాలములోన జొచ్చియు । అమృతము బోయు చుండు ॥ప్రా॥ 6. గుట్టుగాను వినుము । నాభి । పుట్టలోని పాము । కోపం కొచ్చియు బుస్ బుస్‌యని । చెట్టు । యెక్కియాడు ॥ప్రా॥ 7. భువి ముధక్‌పల్లి పాము । జెట్టి గలిపె సూత్రం । అవధూత నిర్మలానందుడు దెలిపెను । కీలు యెరుగ మేలు ॥ప్రా॥

81. తత్వం-పీల్ రాగం-ఆట

1. మనసు పరుగిడుచున్న । మన శ్వాసఆడు । మన శ్వాసఆడితె । మేనంత కదులు ॥మ॥ 2. మన ఆహారము సంచిలో జూడరా । చిన్న చిన్న రసపూలు వుండెను గనురా ॥మ॥ 3. మనసు ఆడకున్న అరుగాదు । అన్నం । మనలోపల జూడ యెంతెంతొ చిత్రం ॥మ॥ 4. జీర్ణకోశం స్వతఃయేమి చేయదురా । జీర్ణింప జేయును మనలోని రసముల్ ॥మ॥ 5. ప్రాణంబు చేతనే మేనాడురన్న । ప్రాణాపానంబుల నీవెరుగరన్న ॥మ॥ 6. అవధూత నిర్మలానందురన్న । ఆ మనసుకు పగ్గంవేయు మనెరన్న ॥మ॥

82. తత్వం—కాంభోజి రాగం—ఆట

1. నాల్గు తనవులు నాల్గావస్థలు దాటి మరచిపోవె పాపి మనుసా । నీల్గి చచ్చినంక నీవెలేకపోతె నిరామయం గాదె మనుసా ॥నా॥ 2. మనసునిలచిపోతె

యేపేరు బెట్టెవు అందని మాటలుజీవా । మనసు నిల్పలేక నామాలుతపసులు యెందుకు కొరగావుజీవా ॥నా॥ 3. అన్ని మత గ్రంథముల సారాంశము యిదియె యెన్నసఖ్యముగాదె మనుసా । అన్ని వేదంబుల అంతంబు యిదియనుచు అగండి చాటవెమనుసా ॥నా॥ 4. యేమి జెప్పదమన్న యే పేరుబెట్టిన యెరుకాకే మూలంబౌ మనుసా। రామక్రిష్ణ, యేసు, అల్లయని అన్న భ్రమకే మూలంబౌను మనుసా ॥నా॥ 5. అవధూత నిర్మలానందుని మాటలు ఆలకించవె పాపిమనుసా। అనివలోశాస్త్రాలుచదివి వొర్లి వొర్లి అసలేదొదెల్యావు మనుసా ॥నా॥

83. తత్వం—శివరంజని రాగం—ఆది

1. కనిపించెదంత జూట । కనిపించినదే ఆ బాట । కనరానిది ఆ మాట । కనుమరుగై యున్నది తేట ॥క॥ 2. మన మందిరంబులో కోట । విను కోటకు సరిపడె ప్యాట ఘన కోట దాటితె బాట । మన మనసుకు అందని దాటి ॥క॥ 3. రెండెడ్లు గట్టిన మోట । రెండింటి నడుమ తాడాట । రెండింటి కొనల చోట । మొండోడు పాడెనె పాట ॥క॥ 4. సాటు నుంచి ఒక మోటు । కాటి కాపరి మాటు । గూటిలో పిట్టకు పాటు । బడి గుద్దుక చచ్చెటి చోటు ॥క॥ 5. పాము జెట్టీ ఒక చోట । పసందుగ గలిసెఆట । పాము జెట్టిపై ఆట । అవధూత నిర్మలుని మాట ॥క॥

84. తత్వం—శ్రీరాగం—ఆట

1. జీవితాంతము చదివిన మనుసా । ఈ। శాస్త్రంబు లొడువవె మనుసా। నీ వెన్ని చదివిన ఆత్మనెరుగ లేవు వంట గరిటె విధము మనుసా ॥జీ॥ 2. వదురుట మానుకొ మనుస్సా । పరులతో వాదించుటే తప్పు మనుసా । మదము తెనిమిది అనచి ముదముగ గూర్చుండి । ముదమొందవె పాపి మనుసా ॥జీ॥ 3. యే పురాణము చదివిన మనుస్సా । నీకు యేమిరాదు పాపిమనుసా । నీ పురాణ మెరుగు నిండెల కోర్చియు। తాపంబు వోవునె మనుసా ॥జీ॥ 4. వేదాలు చదివిన మనుసా । నీ బాధలు మాన్పవె మనుసా।నీ వేద మెరుగుము వాద బేధము విడచి। నీకె మేలౌను మనుసా ॥జీ॥ 5. సాంఖ్య శాస్త్రము నేర్చి మనుసా।నీవు తర్కంబు జేయకె మనుసా । సాంఖ్య శాస్త్రంబేల సాధించు అమనస్క । భావంబు నీలోన మనుసా ॥జీ॥ 6. మత గ్రంథములు యేల మనుసా । నీ ।మరుగుగంటె చాలు మనుసా । సతతము అవధూత నిర్మలానందుడు। సోహంబు నెరుగుమనె మనుసా ॥జీ॥

85. తత్వం-రేగుప్తి రాగం—ఆది

1. బంధ మోక్షములకు మనసే । బహుళ కారణమని తెల్యు జీవా ।

ఆందంబుగ పుత్ర మిత్ర భార్యాలపైన । చిత్రంబుగ భ్రమలు కల్పించుచుండును ॥బం॥ 2. దుఃఖములోనుండు మనసు । బహు సుఖంబులో నుండు మనసు సుఖ దుఃఖములచేత ప్రపంచములో జిక్కి । ఆటలాడుచు నుండు యెందరుయేమన్న ॥బం॥ 3. అన్నిగుణంబులాకుమనుసె భీజంబున నుండె గడుసు। యెన్నెన్నో కోరికలు కల్పించుకొనిలావు । పరిగెత్తు చుండును । కుక్క విధంబుగ ॥బం॥ 4. చాలగాను యిటు వినుమా । నీవు । సాధించు యోగంబు గనుమా । బాల అవధూత నిర్మలానందుడు । సోహంబులో గురి మరిచి పొమ్మని చెప్పె ॥బం॥

## 86. తత్వం-మాండు రాగం-ఆది

1. ఎక్కడిదీ బంధం-ఎక్కడి జీవితమను బంధం। రెక్కలు వచ్చెన పక్షి విధం యెగిరి పోతెయేం సంబంధం ॥ఎ॥ 2. అంగడి వచ్చినఘూ-ఆగము అంగడికైనాము-అంగడి దొంగల పాలైనాము-అంగడి సంఘము దాటి పోతాము ॥ఎ॥ 3. గాలిలో పతంగి అలి గంతులువేసె పతంగి-చాలగ ఆడును గాలి పతంగి-నూలు తెగిన కనరాని పతంగి ఎ॥ ॥4. నూతనమైఇల్లు-కొన్నాళ్ళకు పాతబడె ఈ ఇల్లు-పాతబడి కూలెటి ఇల్లు । ప్రీతెందుకు ఇది అద్దిల్లు ॥ఎ॥ 5. అవనిలో వినుమా। అన్ని అంతంబని గనుమా । ఆవధూత నిర్మలానందుని-అత్మవిచారం శ్రేష్ఠం బనుమా ॥ఎ॥

## 87. తత్వం-మోహన రాగం-ఆట

1. ఎవరి నేమనబోము మేము । జీవా । కళ్యాణంబు కొరకు పాటు బడ్డాము ॥ఎ॥ 2. యేడు కోటలు గలిపినము । మేము । జోడు పక్షుల గూడి దాటి పోయినాము ॥ఎ॥ 3. సోహం భావము దెల్సినాము । సోహం । బనె తావు దాటియు సొక్కి పోయినాము ॥ఎ॥ 4. లోకం యేకం జేసినాము । యేకం। జేసి లోకందాటి యెరుక మరచినము ॥ఎ॥ 5. అవధూత నిర్మలానంద । పాద। పద్మంబులకు మ్రొక్కి అవనిదాటినము ॥ఎ॥

## 88. తత్వం-ఆది

1. వదిరేపేవారికి కుదురాదు యోగంబు । ఇదె బ్రహ్మజ్ఞానంబు తెలుసుకో వో మూఢ॥వ॥ 2. మనసు నిల్పలేక కొంగ విధములావు। మాల్మదిప్పుచు గూర్చున్న ఫలమేమిరా ॥వ॥ 3. గంజాయి త్రాగుచు మందిని చెడుపుచు । కాలంబు గడిపిన యేమివచ్చును నీకు ॥వ॥ 4. పంచవ్యసనంబులలో జిక్కుకొని నీవు పాడై పోకుము కోరి పాటించి మది నిల్పు ॥వ॥ 5. ముధకోపల్లి నివాసుడై బోదించె అవధూత నిర్మలానందుడు ఇవిందురెదె ॥వ॥

## 89. తత్వం-ఆట

1. వినండి గురువుల భోధ । కనండి భక్తుల బాధ ॥వి॥ కనక కాంక్షచే భోధల జేయుచు స్త్రీలను జెడిపెటి వారలు గలరట ॥వి॥ 2. కుటుంబ పోషణ కొరకయ్యి । అటు ఇటు దిరుగుచు ఆశ్రమముల్ వేసేటి ॥వి॥ 3. ముద్రలెన్నియో జెప్పియు తుదకు, మూలం జెప్పక కథల జెప్పేరట ॥వి॥ 4. తిరిగి తిరిగి వేసారియు కొనకు, మరుగు దెల్యక శిష్యులేడ్చేరట ॥వి॥ అవధూత నిర్మలానందుడు । అవణిలో తిరిగి వేసారిన బ్రతుకులో ॥వి॥

## 90. షణ్ముఖ ప్రియ రాగం—ఆది

1. గుడిలో గణ గణ గంటల మ్రోతలండి । మన సోహంబనె వీణనాద మండి ॥గు॥ 2. ఆరిటిపై కూతగూయునండి । అరుపులు దాటిన నీవెనండి ॥గు॥ 3. తొమ్మిది తూటులు మూసుకొండి । ఈ బొమ్మలో నాదాలు దాటిపొండి ॥గు॥ 4. ఐదు రంగులు గురి చూచుకొండి । మరిఐదు రుచులయెరిగి దాటుకొండి ॥గు॥ 5. యేడింటిలో ఆది ఠిరుగుతుంది । మేడలో జ్యోతై వెలుగుతుంది ॥గు॥ 6. బాలఅవధూత నిర్మలానందుడనెను । బయలులో గలసి బయలింక దాటుమనెను ॥గు॥

## 91. తత్వం—బైరవి రాగం-ఆట

1. తెలిసింది తెలిసిందని లావు లావు దుంకుతవు । తెలిసింది యేముందిరా । ఓరోరి భడువ । తెలయరాకుంటుందిరా ॥తె॥ 2. యెరిగితి యెరిగితి ననచు చాల నీవు । యెగిరెగిరి పడెదావురా।యెరిగిందేమి యెరుక కందబోదురా ॥తె॥ 3. యెరుక మరచినంక యేముంది నీ లోన।యెరుగరాని మాటరా । చెప్పరాక యెరుక మరుపు లేనిదిరా ॥తె॥ 4. ఉత్త దేపునిలోన లయమొందు యేముంది । అంత వృత్తదె ఔనురా । నీ లోపల వృత్తదే మిగులునురా ॥తె॥ 5. అవధూత నిర్మలానందుని మాటలు అలకించవేమిరా । అందరాక అంత సూన్యంబాయెరా ॥తె॥

## 92. తత్వం—ధరశంకర రాగం—ఆట

1. తాను చచ్చేదాక । నిద్రలో నిదుర వచ్చేదాక । యెరుక మరిచెదాక యెరుక మరుపులు లేనిదాక । పోవె జీవా.........అందాక ॥తా॥ 2. తాననగ యెవరు? । తన వారు యెవరు? గురినిల్పె దెవరు? గురి మరిచిదెవరు। పోవెజీవా... అందాక ॥తా॥ 3. తన చోటు యేది? తరచేది యేది? తత్వంబు యేది? । సత్యంబు యేది।పోవెజీవా......అందాక ॥తా॥ 4. మూల చక్రంబేది?।చక్రమ్ములో యుక్తేది? శక్తి లేచితె అది । ముక్తి బొందెదేది । పోవె జీవా......అందాక ॥తా॥ 5. దాత

అవధూత । నిర్మలానందుతా । తాపు గలిసె మూత । పెకలించు తనచేత । పోవె జీవా...... ముధక్పల్లి దాక (అందాక) ॥తా॥

93. భలేతమ్ముడులో– (నా మది నిన్ను పిలిచింది గానమై అనుమాదిరి)

ఓ జీవమా–జీవమా–జీవమా

చరణం:– నీ మదిలోన యోచించు జీవమా
మూఢ జీవమా–వో జీవమా ॥నీ॥

పల్లవి:–చూడుము హృదయాంతరంగాలలోన
పాడును సోహం యెడింటిలోన

అనుపల్లవి:–ఘనమైన లోపల తూట్లన్ని మూసి
తన మన సాపియు చూడరా ॥నీ॥
చూచు కనులువేరు చూపు వేరు
చూపులోన మరచి చూడరా
ఆ బయలందు నిలయమై పోతె
అంతమందు జన్మ (కుతాపు) లేదురా ॥నీ॥
భువిలో బుదులకై వెలసేను కాదా
అవధూత నిర్మలానందుడు-దివ్యానందుడు ॥నీ॥

94. తత్వం – (భలేమంచిరోజు పసందైన రోజు అనుమాదిరి)

చరణం:– బలం వున్నదనుచు బహు నీల్గేదావు
మలంబట్టి భ్రాంతి మట్టిమేను......ఆ....... ॥బ॥

పల్లవి:–నీళ్ళు నిప్పు వాయువుతోని నిలచిన యీ బొక్కలమేను
నల్లకండ్లుపై చూపులతో తెల్లగాను మారిన నాడు
తల్లి పిల్ల బంధాలన్ని మెల్లగ పోవు యెరుగుము జీవా ॥బ॥
కల్ల లోకమందున నీవు । కయ్యంబులు బెట్టుక చాల
నిజపలుకులు మరచియు జీవ । భజనంటె భయపడనేల
అవధూత నిర్మలానందుడు తత్వసారమిప్పి చెప్పెకు ॥బ॥

95. తత్వం–మాయ మాళవ గౌళ రాగం–ఏక

1. దృంచి వేయుము మోహము । పంచాగ్నిలో ॥దృంచి॥ దృంచి వేయుము నీవు । సంచితంబుల ద్రోచి । పంచరంగులు దాటి మంచిపై గూర్చుండి ॥దృ॥ 2. పాప-లోపల చూపు పదిలముగ నిల్పితె । చూపు యందున చూపు చూడ శక్యముగాక ॥దృ॥ 3. సన్నని బిలములో మెల్లగదూరియు । వెన్నల

దాటియు మన్ననతో వుండు ॥దృ॥ 4. దంభ దర్పము విడచి శాంబావి ముద్రలో । కుంభకంబున ప్రాణి స్థంభించి నిల్పుము ॥దృ॥ 5. ప్రీతితో అవధూత నిర్మలానందుడు । నీతితో బోధించె నిజమైన తత్వంబు ॥దృ॥

96. తత్వం—సింధూళ రాగం—ఆది

1. సోహం సోహం సోహం । సోహం సోహం గురుచరణం । యెవరైననుసరె ముక్తి పొందె మార్గం । సోహం సోహం గురుచరణం ॥సో॥ 2. నారాయణ శివయజులైనను సరె । సోహం ధ్యాన్యం జేసి తరించవలెన్ । పార్వతి, లక్ష్మి, వాణియైన సరె । సోహం ధ్యాన్యంజేసి తరించవలెన్ ॥సో॥ 3. ముక్కోటి దేవతలైన సరె । మునులైన యోగి పుంగవులైనన్ । చక్కటి ఋషి ప్రవక్తలైన సరె । సోహం ధ్యానంజేసి తరించవలెన్ । సోహం ధ్యానం ప్రతిఇంటిలో ప్రతి దినము జరుగు చుండెనయా । సోహంబే గురునకు మూలం అజపధ్యానము చేయునయా ॥సో॥ 5. సోహంచేతనె అవధూత నిర్మలానందుడు కొండలెగ ప్రాకెనయా । సోహంమరచి తనలొతానై బయలులో గలిసి పోయెనయా ॥సో॥

97. తత్వం—భీమ్‌ప్లాస్ రాగం—ఏక

1. అందరిలోన వున్న చిన్న ఆడిదాన్ని । ముందె వున్న అందాలరాణిని। అందర్ని ముంచెదాన్ని ఆర్యులనుదప్ప ॥అ॥ 2. పొందుజేయని వారుబేరు । యెందు జూచినగాని సందేహమిడుకి ॥అ॥ 3. ఎందరో చెడిరినను దాటలేక । కొందరు దాటేరు కోరికలిడచి ॥అ॥ 4. సుందరాంగిని చూపులతోనె । అందర్ని వశము జేసెటి ఆడదాన్ని ॥అ॥ 5. ధరణి శ్రీ ముధక్‌పల్లి నివాసుడు। అవధూత నిర్మలానందుతు దాటె ॥అ॥

98. తత్వం-అమీరు కళ్యాణి రాగం—జుల్వ

1. యోగామృతమును త్రాగు । వేగనీతో యోగమెరిగి । రాగద్వేషము లిడచి గురుమూర్తిని జేరియిపుడె ॥యో॥ 2. కంటిని వొంటిగ జేసి । మింట మనసుంచియును । ఇంటిలోన పోరణచియు చింతలన్ని విడువు మిపుడె ॥యో॥ 3. ధరణిలోన సుఖము లేదు । క్షణములేనె మాయమౌను । పరమాత్మని గాంచు జీవ స్థిరమైన యోగ మెరిగి ॥యో॥ 4. బయలులోన భావమెరగి నయముగ తన మనసు నిలిపి । భయమిడచియు భక్తులతో పర మొందిన మేలుగల్లు ॥యో॥ 5. మూలమందు కీలు దెలసి । మేలుగాను దృష్టి నడిపి । బాల నిర్మలానందుని తత్వ మెరుగు మిత్రులార ॥యో॥

99. ఓ మూఢ జీవా ? । యోచించలేవా । ఈ మూల మెరుగ

1. ఓ మూఢ జీవా । యోచించ లేవా । ఈ మూలమెరుగ గురుదరికె

రావా? । నాలుగు ఆరు । పై పని వుండు । పన్నెండు పదహారు । రెంటి పైన జోరు । కనవా జీవా? । కనులందు కనుము—ఘనమైన ఘనుము ॥ఓ॥ 2. నీలోన చూడు నీ మనసు గూడు । నీ నాళ్ళజోడు నిల్పితె ఆడు । ఆడిపాడి మేరు । ఊర్ధ్వమందు జేరు వినవా ? జీవా ? — ॥ఓ మూఢ॥ 3. జంట మధ్య జూడు । వొంటికాయలోడు । అంటి అంటకుండ । ఇంటిలోన వాడు । ఆడించుతాడు — అందరిని వాడులేపి....జీవా....॥ఓమూఢ॥ 4. తనచోటు విడచి । రెంటి మధ్య నించి । పై దారి నడిచి । తన మరుగు తెలసి । ఆ చోటు తరసి । అంతమందు గలసి । పోవా... జీవా... ॥ఓ మూఢ॥ 5. సోహం మాత దైవం । సదా నిర్వికారం । అవధూత నిర్మలా । నంద యోగిం । మనసు నిల్పుకుంటె అదె ముక్తిమార్గం । అనెను—వినుమా... ॥ఓ మూఢ॥

100. తత్వం—కీరవాలి రాగం—ఆది

1. చెట్టు మర్మము తరసి తెలుసుకో । వో జ్ఞాని రాజహంస । సుజ్ఞాని రాజ హంస । వట్టి భ్రాంతిలో జిక్కక గురుచరణంబుల గట్టిగా పట్టుకో హంస—వో జ్ఞాని రాజహంస_సుజ్ఞాని రాజహంస । వినుమ యెట్లైన నీకే మేలౌను వోజ్ఞాని రాజహంస ॥సు॥ ॥చె॥ 2. ఇనుముపై సూదంటు జాయిపడిన విధము । వో జ్ఞాని రాజహంస ॥సు॥ ॥చె॥ 3. చెట్టుకు తొమ్మిది బిలములు వుండెను । గట్టిగా మూయవె హంస—వోజ్ఞాని రాజహంస । సుజ్ఞాని రాజహంస । చుట్టి చుట్టుకొని పండిన పాము అది । చిర్రునలేచునె హంస ॥సు॥ ॥చె॥ 4. రెండు కొమ్మలపైన గూడు గూర్చున్నది । జ్ఞాని రాజహంస సుజ్ఞాని రాజహంస రెంటిని ఆడించి గూడును లేపితె బట్టబయలే రాజహంస ॥సు॥ ॥చె॥ 5. అవధూత నిర్మలానందుని పాద ములు జ్ఞాని రాజహంస । సుజ్ఞాని రాజహంస । భువిలోన నమ్మియు మేరు శిఖరములోని లయమొందవే రాజహంస ॥సు॥ ॥చె॥

101. తత్వం—రేవతి రాగం—ఆది

1. ఎక్కడుంటెనేమిరా । ఓ భక్తుడ జీవన్ముక్తుడ ॥ఎ॥ ఎక్కడుంటె నేమిరా । గురుదేవుడు నీ హృదయ పీఠమెక్కి గూర్చుండి సకలము చక్కగాను బోధ జేయగ ॥ఎ॥ 2. మరువక మన మనసుయందున నిరతము ధ్యానించు చుండిన । కనులలో ఆ వెలుగు లోపల కనపడి కరుణించు చుండును ॥ఎ॥ 3. ఇతర వేల్పులనమ్మ చుండిన । చిత్తమెప్పుడు చెదురు చుండును । సతతము గురునామ స్మరణచేయు చుండిన పరమ పదమదె ॥ఎ॥ 4. రాతి ప్రతిమలను నమ్మబోకుము । కోతిచేష్టల చేయబోకుము । త్యాగిగ అనన్య భక్తిచే చేతులెత్తి మ్రొక్కుచుండుము ॥ఎ॥ 5. ధరణిపై అవధూత నిర్మలానందుడు యీ బోధ జేసెను । గురి లోపల గురుని తెలసి పరమ పదవి జేరుమన్నాడు ॥ఎ॥

102. తత్వం—కోకిల ప్రియి రాగం—ఆది

1. ఎవరి నేమనబోకు మనుసా । భువిలో మౌనమే ముఖ్యంబు మనుసా। ఎవరిని యేమన్న ఆయాసమొందెదరు । నొప్పించకా నీవు తప్పించుకొని తిరుగు ॥ఎ॥ 2. ఈషణ్త్రయములవలలో సొక్కి । నాశనమయ్యేవు తుదకు జిక్కి ॥ఎ॥ 3. నీలో నీవె పరిశోధించుకా । కాలము వృథాజేయకే ఓ మనుసా ॥ఎ॥ 4. సంసారము జేస్తువుండు। నీ స్వామిని మరువక నుండు ॥ఎ॥ 5. అవధూత నిర్మలానందుడు దెలిపెను । అవనిలో వుండి కూడ అంటకుండుమని ॥ఎ॥

103. తత్వం—గాణమూర్తి—ఏక

1. ఆడదాన్నె చూడరా । ఓరోరి మూఢ గాడిదిగాన్నె వెతుకరా । ఆడిదాన్నె చూడలేకను గాడిదిగాన్నె వెతుకలేకను । మూడు కాల్వలు దాటలేకను మునిగిపోతవు ముండకొడక ॥ఆ॥ 2. ఏడుగురుని గూడుకొని । ఎనిమిది మంది నెత్తుకొని । కారు చీకటి కమ్మియున్న సముద్రంబులో మునిగి యున్నది ॥ఆ॥ 3. పంచ రంగుల యింటి లోపల ఫక్కు ఫక్కున నవ్వుచున్నది । వంచింపేడి మోసకాల్లను కావలి తను బెట్టుకొన్నది ॥ఆ॥ 4. లెక్కలేని వాళ్ళగన్నది । మక్కువతో నేకన్నెనన్నది । చక్కనైన చిన్నదున్నది చుక్కవలె నా రూపు యున్నది ॥ఆ॥ 5. భువి ముధక్పల్లి లోపల పుట్టిగిట్టని వాడు యున్నది । అవధూత నిర్మలానందుని తను అంటనన్నది ॥ఆ॥

104. తత్వం—గౌరి మనోహర రాగం—ఆట

1. వృధచేయకు కాలం । జన్మం । ఇది మాయా జాలం సదారాము జన్మం ॥వృ॥ మదియందు నీవు సదా యోచెంచుము । సదుమం మంత్రము హృదిలో నుండగ ॥వృ॥ 2. గురు వరునిజేరి। మరుగు। గురెరుగక కోరి।సరు వరుని మరి స్మరణ చేయకను।గురి అనుభవము కాలేదనెదవు ॥వృ॥ 3. ఆడించు పాముని । ఆడి । పాడించు పాముని । ఆడించి నీవు కోడెకాడవై। వోడించు ఆ హంసతో పాముని ॥వృ॥ 4. మూడక్షరముల । మాట। మూలము దెలిసియు బాట । ఆట ఈడ నడి నాశము ఘూట । బేధించి చేరుమచ్చోట ॥వృ॥ 5. ధరణి ముధక్పల్లి । వాసుడు । దయదలచి చూడు। అవధూత నిర్మలానందుడు । ఆత్మ తత్వము బోధజేయగ ॥వృ॥

105. తత్వం—సుణప్రియ రాగం—ఆట

1. ఈడనాడి యెడుమకుండు। సూర్యనాడి కుడికి నుండు । ఈడ పింగళ మధ్య మందు సుషుమ్నానాడి తెలుసుకొండు ॥ఈ॥ 2. గాంధారి కుడి నేత్రము హస్తిని జిహ్వయందు । కానవేర యెడుమ నేత్రమందు మెలిగెడె నందు ॥ఈ॥

3. అశ్వని మెడుమ చెవిలో । పూషనాడి కుడి చెవిలో । అలంబసమెడ యందు కుహూనాడి గుదము నందు ॥ఈ॥ 4. శంఖిని నాభిస్థానము రెంటి తెలుసుకో । శంకదీర్చె అవధూత నిర్మలానందున్ని తెలుసుకో ॥ఈ॥

106. తత్వం—భూరి కళ్యాణి రాగం—ఏక

1. దుఃఖము శరీర పరిగ్రహము వల్ల వచ్చె । శరీర పరిగ్రహము వల్ల కర్మము హెచ్చె ॥దుః॥ 2. కర్మము చేతవిను రాగద్వేషములువచ్చె । రాగాద్వేష ముతో అభిమానము హెచ్చె ॥దుః॥ 3. అభిమానము చేత అవివేకము వచ్చె । అవివేకం చేత అజ్ఞానంబు హెచ్చె ॥దుః॥ 4. అజ్ఞానంబు ఆత్మ జ్ఞానోదయము చేత । శూన్యమైపోతె అన్ని శూన్యమే కదరా ॥దుః॥ 5. బాలయోగి అవధూత నిర్మలానంద । భావము రంజిల్ల యీ బోధ జేసెను । చాలగ యోశించుము చక్కని గురుని జేరి ॥సుః॥

107. తత్వం—నాగాభరణ రాగం—త్రిపుట

1. జ్ఞానము మనసు బుద్ధి చిత్తాహంకారము అంతరేంద్రియములు తెల్యన్న। ప్రాణాపాణ ఉదానసమానవ్యాన ప్రాణేంద్రియములు గనుమన్న ॥జ్ఞా॥ 2 శ్రోత్రముత్వక్కు చక్షువు జిహ్వా ఘ్రాణము జ్ఞానేంద్రియములన్న । మిత్రమా శబ్ద స్పర్శ రూప రసగంధముల్ పంచతన్మాత్రలన్న ॥జ్ఞా॥ 3. వాక్కుపాణిపాదము గుహ్యము గుదము కర్మేంద్రియంబులన్న । చక్కగాను విను యిరువై ఐదు తత్వంబుల వివరంబన్న ॥జ్ఞా॥ 4. ఇరువై ఆరోవాడె జీవుడని తెలుసుకొని పరికించన్న । గురు అవదూత నిర్మలానందుడు యీ సాంఖ్యము బోదించెన్న ॥జ్ఞా॥

108. తత్వం—కనకమాలిక రాగం—ఆట

1. నిత్యానిత్య వస్తు వివేకం బ్రహ్మసత్యం జగత్ మిథ్య । ఇహాముత్రార్థ ఫలభోగమనగ తెలుసుకో । ఇహలోకమందు పరలోకమందు సంబోగాది సుఖములు కోరకపోవుటె ॥ని॥ 2. శమాదిషట్క సంపత్తి యనగయివియని తెలుసుకో । శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానము వినుము ॥ని॥ 3. శమముయనగ బయట యింద్రియములను అరికట్టుట వినుము । దమము అనగ అంతరేంద్రియములను అరికట్టుటగనుము ॥ని॥ 4. ఉపరతి యనగ సమస్త కర్మములను సహించుటె తెలుకో । తితీక్షయనగ సుఖ దుఃఖమానాభిమానములు సహించుటె ॥ని॥ 5. శ్రద్ధ యనగ గురువేదాంత వాక్యములందు విశ్వాసం సమాధానముయనగ పూర్వ వాసనలు విడచి వేదాంతం వినుటె ॥ని॥ 6. ముముక్షత్వమనగా మోక్షేఛ్ఛచే పంచభూతముల పరిశోధించి । మమకార హంకారములిడి అవధూత నిర్మలానందుడు దెలిపెను ॥ని॥

## 109. తత్వం—మోహన రాగం-ఆది

1. వినవన్న వినురా—వినుకోని గనురా—నాకనకపు తునక—ముత్యాల గొలుక—నాకన్న కొడక—(నావజ్రముతునక)—నారామచిలుక।(శ్రీగంధపుమొలక) ॥వి॥ 2. తనువు శాశ్వితమా తన దనుచు పోషింప । ధనము శాశ్వితమా తర్లి పోయెడినాడు ॥వి॥ 3. ద్వేషం అసూయవంటి క్రూరత్వంబింలేదు। సంసారము వంటి రోగ బాదలేదు ॥వి॥ 4. బుద్ధిమాంద్యముచే మౌనముగా యున్నాను । శుద్ధ పరిపూర్ణ హృదయుడెన్నటికిని గాలేడు ॥వి॥ 5. కామమోహం హృదిలో సత్యంబు వెలుగునా ? నీ మూర్ఖకృత్యములే నీకు దుఃఖముదెచ్చు ॥వి॥ 6. అవధూత నిర్మలానందుడు బోధించె । వివేకవంతుడు మనోచంచల్యమునాపు ॥వి॥

## 110. తత్వం—కళ్యాణి రాగం—ఆది

ఎందుకు నీకు మందగుణము । తొందరపాటు విడువుమా । అందమైన భ్రుకూటియందున । సుందరంబును జూడుమా ॥ఎం॥ శుద్ధమైన ఆలోచనచే । శుద్ధమైన చూపుచే । శుద్ధమైన మాటలచే । శుద్ధమైన జీవనము గడుపుము ॥ఎం॥ శుద్ధమైన సూక్ష్మ పరిశీలనచే । శుద్ధమైన జీవిత లక్ష్యముచే । శుద్ధమైన తాత్విక మననముచే । విశుద్ధమైన విశ్రాంతిని జెందుము ॥ఎం॥ పుట్టుకవల్లనె దుఃఖము వచ్చెను । ఇట్టి దుఃఖము మాన్పు మార్గము సత్యము । వట్టి మాటలు గట్టిపెట్టి । పుట్టుగసుఃఖదుఃఖంబుల విడువుము ॥ఎం॥ అవధూత నిర్మలానందుని సద్వచనములు। అవివేకులకు అంతుబట్టనివి । అవనిలో యీ మర్మంబెరుగుట । సదినయపరులకె సాధ్యంబగును ॥ఎం॥

## 111. తత్వం

1. ఎంత మోనము జేస్తివె ఓ కాయపురమా। చింతలో బడిపోతేనే। సంత సంబున నీవు యెంతో వింత మాటలు బలికి చాల । కాంతల జూచి మిన్నకన్ను సైగల జేసితివి ॥ఎం॥ 2. కుక్క విధము పెరిగియు సాముల నెప్పుడు । ధిక్కరించి తిరిగియు బొక్క బోర్లపడి పోతివి దిక్కునీళ్లి నీటము వెల్యాక మక్కువతో సద్గురుని గానక లెక్కలేని పనులు జేసి ॥ఎం॥ 3 అన్నదమ్ములు పుత్రులు నిన్ను దెచ్చి అక్కచెల్లెలు చూడగా లెక్కలేని మిత్రులుండగ చక్కగా స్నానంబు బోసి । అక్కడ కంపురమునందు వొక్కన్నే పండబెట్టిరి ॥ఎం॥

4. కాటిలోన బెట్టియు కంసముతోడ కట్టెలన్ని శేర్చియు । నీటికుండ పగుల గొట్టియు బూటకము ఇంట్లోల్లు గూడి మంటబెట్టి మొత్తుకొనుచు । ఇంటిదారి పట్టి పోదురు. ॥ఎం॥ 5. ఇంటికి వచ్చియు కల్లుసీసాల్ । నోటిలోన బెట్టియు వంటజేసుకొని యందరు నన్ను మరసి మాంసంబు । గుంట నక్కలలాగ దినుచు జంట జంటలు గూర్చుందురు ॥ఎం॥ 6 అవధూత నిర్మలానందుని బోధ భువిలో దెలియక పోతివి । ధర్మందప్పి దిరిగి చెడితివి దారియేదో తెల్యకుంటివి మర్మ మిప్పుడు దెలిసినంకడ యేమిసేతని యేడ్చుచుంటివి ॥ఎం॥.

## 112. తత్వం

1. తొల్లిమల మూత్రము కొంపలో బుట్టిబయటపడితివి వోరన్న । తల్లి చన్నుపాలను త్రాగియునీమేను పెద్ద పెరిగెనురన్న ॥తొ॥ 2. మల్లి దానికి ఆశ పడెదవు అందులో యేమున్నదిరన్న । కల్లకాదు నీ కనులపై పొరచే కయ్యాలో పడితివి వోరన్న ॥తొ॥ 3. బట్ట విప్పి చూచిన ఆ స్థలము గుట్టు బయట పడును రన్న పుట్టెడు వాసన మూత్రము రక్తము బొక్కల పెట్టె వినుమన్న ॥తొ॥ 4 అందుడవై ఆ తొట్టికు భ్రమసి ఆగమైతివి వోరన్న । బంధములో బడవేసి నిన్నది పలు వెతలపాలు జేసెనురన్న ॥తొ॥ 5 మదక్‌పల్లి నివాసుడు అవధూత నిర్మలానందన్న మదినిల్పెటి ఆ మార్గము కొరకు వైరాగ్యము బోధించెన్న॥తొ॥

## 113. తత్వం—సుదర్శన రాగం—ఏక

1. నరములు రోమములు అస్తి చర్మము మాంసంబురన్న । స్థిరముగాను పృథివి వల్లను గల్గిన సంబంధమురన్న ॥న॥ 2. మెదడు, శ్లేష్మం, శుక్లం మూత్రం రక్తం యివియైదన్న । ఉదకమువల్లను మనదేహంబులలో వెలిసెను వినుమన్న ॥న॥ 3. క్షుత్తు పిపాస నిద్ర ఆలస్యంసంగము యివియైదన్న । చిత్త మంచి విను అగ్నివల్లను యివి మనలో యేర్పడినవిరన్న ॥న॥ 4. చలనం గమనత త్రీవం లజ్జ భయము యివియైదన్న । తెలుసుకో వాయువు వల్లనె యివి మన శరీరంబులో బుట్టెనురన్న ॥న॥ 5. కామము క్రోదము లోభము మోహం మధమత్సరములు ఆరన్న । యెకాంతములో యోశించుము అకాశతత్వములన్న ॥న॥ 6. భువిలో మధక్‌పల్లి నివాసుడై వెలిసెను వినుమన్న । అవధూత నిర్మలానందుడు యీ-బోధ జేసెనురన్న ॥న॥

## 114. తత్వం—సింధుమంధతి రాగం—ఆది

1. పరమ పదవియనగా జీవ పరిశోధించవాక్షి। సాక్ష్యాత్కారకము అమనస్కము చక్రములలో అవి యేవిగావురా ॥ప॥ 2. కర్మ, శక్తిగాదు పదవి జ్ఞానంబు గాదు। హంసభావము జీవేశ్వరుల ఐక్యం సోహం భావముగాదు ॥ప॥ 3. కుండలినిగాదు పదవి మేరు శికరముగాదు। దండిగాను అష్టాంగయోగములు ఈడ పింగళ సుషుమ్నా ముగాదురా ॥ప॥ 4. ఎరుకగాదు వినుము పదవి మరుపు గాదు వినుము। ఎరుక మరపులు లేనిది గాదు యేమిలేని శూన్యంబు గాదురా॥ప॥ 5. ఆత్మగాదు పదవి వినుము పరమాత్మ గాదు పదవి। జాగ్రత్త స్వప్న సుషుప్తి తూర్య, తూర్యా తీతముగాదురా ॥ప॥ 6. మౌనముగాదురా పదవి మాటలుగావురా। ప్రాణములు దేవతలు మతములు పరిపూర్ణంబన అసలెగాదు॥ప॥ 7. మోక్షముగాదురా పదవి। సాక్షిగాదు వినురా। అక్షర పాపపుణ్య రహస్యములు ప్రకృతి పురుషులు అసలెగాదు ॥ప॥ 8. సాకారముగాదు పదవి నిరాకారముగాదు। సాకార నిరాకరంబులపైన వుండేదే పరమ పదవిరా ॥ప॥ 9. ఇది వేదాంతమురా శిష్యుడఇవియేవిగావు వినురా। చెప్పరాక అవధూత నిర్మలానందుడు తనలో తానె గలిసెను ॥ప॥

## 115. తత్వం—లలితోధర రాగం—ఏక

1. పుట్టిన ఫలమేమున్నదిరా। తల్లి గర్భమునా ॥పు॥ పుట్టినందుకు మరి గిట్టని తావుగనకున్న ॥పు॥ 2. మాయ గరికకును గార్ధభ జీవుడు। కాయమే స్థిర మనుచు నమ్మెను గదరా ॥పు॥ 3. అంగడిలోన ముఖముపై గొంగళి దిగేసుకా। దొంగ పాలై ఆగమైతివిరా ॥పు॥ 4. ఐదు నిమిషముల ఆనందం। తొమ్మిది నెలల చెఱసాల బంధంలో ॥పు॥ 5. అజ్ఞానాంధకారము నీవు। ఆ జ్ఞానజ్యోతిచే తరుమలేనిచో ॥పు॥ 6. అవధూత నిర్మలానందుని। ఆత్మతత్వము వినిదెల్సుకున్న ॥పు॥

## 116. తత్వం—దేవగాంధారి రాగం—ఆది

1. చిక్కితివి గదరా జీవామాయవలలో। ఒక్కొక్కసారి జ్ఞానులు సహితము। జ్ఞానము కోల్పోయి అలమటించిరి॥చి॥ 2. త్రాగుట జూదముఆడుట, పరకాంత భోగము సప్త వ్యసనములలో ॥చి॥ 3. ధనము హెచ్చిన మదము హెచ్చును। ధనమదముడిగిన అన్ని వుడుగును ॥చి॥ 4. అష్ట మదములు దృష్టిలో బుట్టిన। కష్టనష్టములే సృష్టి లోపల ॥చి॥ 5. మాయ కాయములో కట్టుబడితివి। కాయములో మాయను విడకా ॥చి॥ 6. అవధూత నిర్మలానందుని। ఆత్మవిచారము విని నడుపక నీవు ॥చి॥

## 117. తత్వం—ధరకోటి రాగం—ఏకతాళం

1. మనుసా గురుని బోధ వినవె మాయమనుసా । తెలుసా ఇది నీకు తెలుసా ? ముందటి గతి వినకున్న గడుసా ॥మ॥ కనులు తెల్లగ జేసి పోయె కాలము వేళె । మన వెంట్రుక వెంట్రుకో పొంట వెయ్య తేళ్ళ మంట ॥మ॥ 2. బ్రతికుండగనే నీవు మతి నిల్పిచూడు । బ్రతుకు సారము దెలిసి క్షితిలోన యోశించి ॥మ॥ 3. అడుగులేని కడువలో పాలు వుండునా । చెడునడక నరులంతె ఈ చెవితో విని ఆ చెవితో వదిలేరు ॥మ॥ 4. ఆలు పిల్లలు వున్న కీలు దెలిసితె చాలు । మేలైన గురు బోధ మరుగు దెలిసితె చాలు ॥మ॥ 5. ఆరోగ్య మున్నపుడె ధ్యానము జేయలేవు । అంతిమ కాలమున యేమి చేసెదవు ॥మ॥ 6. అవదూత నిర్మలానందుడు బోధించె । అజ్ఞానంబు విడిరావె ఓ మనుసా ॥మ

## 118. తత్వం—వసంతగౌళి రాగం—ఆట

1. భజన దెలిసి భజనజేయండి । జనులార మీరు । సుజనసంఘము జేరి తెల్యండి । భజన లేకను మోక్ష పురము యజునికైనను వశముగాదు । నిజము నిజమని యోగులందరు చాటి చెప్పిన సూత్రమిదియె ॥భ॥ 2. ఎరుకచే ప్రతి యెరుక నెరుగండి । ఎరిగిన పిదప । ఎరుక మరుపును తరిమికొట్టండి । ఎరుక లేని స్థలము జేరిన । ఎరుకలేని వారలైనను । పరమపదము జేరిపోయిరి స్థిరముగ తన చోటులోపల ॥భ॥ 3. పుట్ట లోపల చెట్టు బుట్టెనురా । పుట్టిన పిదప । చెట్టు కొనలో బాల బుట్టెనురా । పుట్టిన క్షణమందె తాను ఆకాశము మెత్తుబెరిగి । గుట్టుదెలియని జీవులను పట్టుక్కొని ఆడించుచుండె ॥భ॥ 4. చెట్టంటె చెట్టుగాదండి । గుట్టు దెలిసిన । వారికె యిదిపట్టుపడునండి । వట్టి మాటలు వదురు వారికి । ఇట్టి మర్మము బోధపడక । నట్టడివిలో చిక్కుకొన్ని మరి పుట్టికందని వారలగుదురు ॥భ॥ 5. అవని ముధక్‌పల్లి వాసుండు । అవధూత నిర్మలానందుని తత్వంబు వినుండు । సవినయంబుగ బోధదెలిసితె । జన్మ రోగమే నాశనంబై । భవబంధములన్ని ద్రుంచి । భగవంతుని జేరిపోదురు॥భ॥

## 119. తత్వం—వనస్పతి రాగం—ఆది

1. కర్మదాట వశమా నరుడా । కర్మదాట వశమా । కర్మమర్మము యెరిగిన గాని ॥క॥ ఏ క్షణంబులో యేమి జరుగునో । ఊహకందని విషయ మురా । యే మనులైన యెరిగినగాని । కాయమున్నచో అనుభవింప వలె ॥క॥ 2. వేద శ్లోకములు జదివినగాని । బోధ మర్మము యెరిగినగాని । పోదు బాధ కాయమున్నచో । రాదు జన్మము అంతేకాని ॥క॥ 3. సంసార సాగరములో

పడవ । పయనించు చుండెను వొక పడవ । ఆ సాగరమ్ములో పడవకు బెజ్జం । పడిన అడుగున పడిపోవురా ॥క॥ 4. ఇంటివాళ్ళ లక్షణము మరి । చుట్టు వాల్ల లక్షణము చంటిపిల్లడ స్నేహ లక్షణము । పురాకృతముచే కర్మమాయెను ॥క॥ 5. ద్వంద్వములకు అతీత మైనచో । ద్వంద్వములను సహించు శక్తి గలిగినచో । అందమైన ఈ మేనువున్నచో । కర్మవున్నను లేనట్లె గాని ॥క॥ 6. అవధూత నిర్మలానందుడు । అంతర్ముఖముగ పోయినప్పుడు । ఆ కర్మలేక పోయేను । భువిలోచేరిన కర్మమేమిగిలెను ॥క॥ 7. ఆగామి సంచిత ప్రారబ్ధము । అనుభవించవలె మేనులో జీవుడ । ఆగముగాకు మదక్పల్లిలో విశ్వమానవత స్థాపకునిజేరి తెలుసుకో ॥క॥ 8. అంతిమ కాలము అనంతములోన । ఐక్యముకాగ కర్మలేదురా । చింతలన్నివిడిచి నిద్రలో । శాంతముతో సాధించుకో జీవ ॥క॥

—: భజన :— శరీరమే కర్మం । కర్మ మర్మంబెరుగుటె ధర్మం

## 120. తత్వం—రంజని రాగం—ఆట

1. శ్రీకారం సోహం సోహం । ఓంకారం పంచాక్షరములు । యేకాగ్రతతో నీవు । యెంచిపంచి చదువు । యేకమైన పరమందు । యేమున్నదిరా ముందు । లోకాలన్ని దాటి । లోతుమెరుగ మరుగు ॥శ్రీ॥ 2. అయం వ్యర్థము భావ్యగోపి । సభావతి తెలుసుకొనుము । ఈ వృత్త బట్టబయలు । యేమి లేదు గనుము । సయముగ వినుము । ఇదియే ద్వాదశి । లయమొందు బయలందు । భయము నీకేల ॥శ్రీ॥ 3. స్వప్నే ప్రతియామానాని రూపాని । యథాతథా ఇదియే పంచ దశి వినుము । కల మేల్కొనిన శరీరం యేలాగో । అలాగేయని తెలుసుకొని నడుచు కొనుము ॥శ్రీ॥ 4. మూల భావమిదంజ్ఞాత । శరీరం నాస్తి కేవలం ఈ మూలం లేని శరీరం గురైరుగయేమిలేదు । షోడశి భావం । శోధించు యిదియే । మూడు గుణంబుల విడచి లయ మొందు బయలులో ॥శ్రీ॥ 5. అవధూత నిర్మలానందుని మాటలు । భువిలో పూర్వీకుల వేదాంతవాక్యములు । సవినయముగా వినుచు । సవరించుకొమ్మ । సవరించుకోకున్న మధక్పల్లిరమ్మ ॥శ్రీ॥

## 121. తత్వం—సూర్యకాంత రాగం—ఏక

పల్లవి:— ఈ జన్మలో ఉన్నదా ? విశ్రాంతి । లేనేలేదు కదా । శాంతి

అనుపల్లవి :— పడతివిగదరా ప్రపంచ భ్రాంతిలో । అందుకెమిగిలెను అశాంతి ॥ఈ॥

చరణం : 1. శ్రీమంతం లోకకాంతివంతం । ఈ స్వతంత్రవిడువగ శ్రీ అశాంతం ॥ఈ॥

2. అర్థరహితమైన జన్మమే వ్యర్థం । అందుకే తెలుసుకో పరమార్థం ॥త॥

3. పరుగులుదీసే కోరిక తురగము । గురుధ్యానమనే పగ్గము లేక ॥త॥

4. అవధూత నిర్మలానందుని । ఆత్మతత్వమువిని నడువక ॥త॥

122. తత్వం—శివశక్తి రాగం—ఆటతాళము

1. ఎంత మంచి మగడు దొరికెనే । ముద్దుల మగడు । నిగమగోచర సుఖము నేర్పెనే ॥ఎ॥ ఎంత మంచి మగడు దొరికె యాడలేని స్థలము జూపె । జోడుగనే గూడియుండగ యాడికోదీసుకపోయెను ॥ఎ॥ 2. ముక్కుకు ముక్కెర బెట్టెనే । ముక్కు కొనకు చక్కగనను జూడుమనేనే । ముక్కులోన దృష్టి నడిపి ముక్కువతో సహస్రారకమలము । యెక్కి కూర్చుండి పక్కను గట్టిగా కట్టెయ్యుమనెనే ॥ఎ॥ 3. కాళ్ళకు కడియాలుబెట్టెనే కాళ్ళకుపున్న । కాళ్ళ నాళ్ళను జూడుమనేనే । కాళ్ళనాళ్ళ మర్మమెరిగి । మెల్లగ ఆధారమందున మెల్లని చూపులవాన్ని యుల్లమందున దెల్యుమనేనే ॥ఎ॥ 4. నడుముకుపట్టె బెట్టెనే। కుకి యెడమ్రదిప్పుచు । నడిబొడ్డులో జూడు మనేనే । తడబడక మూడుత్రోవల పెట్టెగుట్టు విప్పుకొనిమరి । నడినాళము వెంట యెక్కి నాథుని జేరుమనెను ॥ఎ॥ 5. చేతులకు గాజులు బెట్టెనే । చేతులకు వున్న । నాళ్ళనునను బాగగనుమనేనే చేతులతో చిన్ముద్రబట్టి ఛాతి చక్కగ నిక్కబట్టి । దృష్టి దృక్కుల గల్పిబట్టి। కోతిని ఆడించుమనియె ॥ఎ॥ 6. చెవులకు కమ్మలు బెట్టెనే । చెవులలోన । సోహం సోహంబని చెప్పెనే । చెవులలోన దశవిధము నాదంబుల వినుచు గంట । నాదంబులో మనసు గలిసి ఆత్మరాముల గలిసి పొమ్మనె ॥ఎ॥ 7. నోటిలో తీర్థంబుబోసెనే । నోటిలోవున్న । నాలుకను బంధించుమనెనే । వాటముగ హృదయ కమలము నీటి తోట్లెను వూవుచుండగ । కోటలన్నియు దాటి సద్గురు ప్యాట జేరిపోదువనెను ॥ఎ॥ 8. శిఖలోన పూలుబెట్టెనే । శికరాగ్రమందు । శ్రీఘంటె జేరుమనియెనె । శికలో పూలదీసివేసి సిగ్గు లజ్జ అన్ని విడిచి । ఒకడె వుండెను ఒంటి మేత దాటిపొమ్మని బోధ జేసెను ॥ఎ॥ 9. కంఠముకు పుస్తె గట్టెనె । కంఠముకు వున్న । జంట త్రాళ్లను వొత్తి పట్టెనె । ఒంటి స్తంభము కున్న ఐదుపూల వరుస గుత్తి నెరిగి । జంటకండ్లను మూసుకొని ఆ వొంటి కన్ను దెరువు మనెను ॥ఎ॥ 10. నొదుట కుంకుమ బొట్టు బెట్టెనే । ఆ బొట్టు లోన । కదులకుండ జూసుకొమ్మనెనే । వదురకుండి వదులకుండి చెదరబోక

ప్రకాశమైన । బొట్టులోన బొట్టుబెట్టుక వృత్తిపైన ఊగమనెను ॥ఎ॥ 11. ధర్మతి మధిపల్లి వాసుడు। అవధూత నిర్మలానందుడు నా ముద్దుగురుండు । నెరుకచే ప్రతి యెరుక నెరిగి యేమిలేని మగని గలసిన । కామ క్రోధ లోభ మోహ మదములన్నియు బోవుననెను ॥ఎ॥

## 123. తత్వం—నిత్యోత్సవ రాగం—ఆట

1. శికములోన శికముదెరసి నాశికము మర్మ్యమురా । కొనమొదలు ఒక్కటి జేసి తనతావు దెల్యుమురా ॥శి॥ 2. పన్నెండు కోటలలో ఆటపరగ దెల్యుమురా । పన్నెండు కోటలను దాటితె బయలె మిగులునురా ॥శి॥ 3. కాళ్ళు బొడ్డు, చేతులు కనుల మధ్య జూడుమురా । కల్లగాదు ముక్కు, చెవులు, జుట్టు జూడుమురా ॥శి॥ 4. కంఠము, గుదము, నాలుక, మెడ, చాటి చక్కగ పంచుమురా । జంట నాగులబట్టి త్రిప్పుచు పండ్లను బిగబట్టి చూడుమురా ॥శి॥ 5. బాలయోగి అవధూత నిర్మలానందుడు దెల్పెనురా । నాలుగు స్తంభాల మేడ దాటితె నయము వినుమురా ॥శి॥

## 124. తత్వం—లలితోదర రాగం—ఆట

1. గురుదేవాయని గురుదేవాయని । గురిలో ధ్యానము జేయుమురా । పరిహాస మేల పర్యవసానమున । యెవరూ నిను రక్షింపరురా ॥ గు ॥ 2. స్వల్ప జ్ఞానముతో తెలియనిదే । తెలిసినదని విర్రవీగుదువు । అల్పసుఖంబైన విషయ మలినంబులో । క్రుళ్ళుచున్న కీటకము విధము ॥గు॥ 3. ధనము నకై నీ పేరాశనువిడి । వైరాగ్యమును వృద్ధిపరుచుకొను క్షణక్షణమునకు తిరిగే మనసును । అభ్యాసముచే నిరోధించుమురా ॥గు॥ 4. నారీ స్తనములు నాభిదేశము జూచి । మోహితుడవు గాకుమునీవు । నీరు మాంసము మజ్జా మొదలగు। మార్పుచే దుర్వాసన గొట్టును ॥గు॥ 5. ఎంత వరకు నీవు ధనమార్జింతువో । గంత వరకె నిను ప్రేమింతురురా । ధనము బలము వుడిగిన వేళ । యింట యెవ్వరు కానరురా ॥గు॥ 6. ఊపిరాడు వరకె బాంధవులు భార్యా పుత్రుల బంధాలు ఊపిరికె శరీరముకు బంధము దొలగిన యేం సంబంధం ॥గు॥ 7. తల్లిగర్భములో శయనించట మెందుకు మళ్లి మళ్లి పుట్టడమెందుకు । మళ్లిమళ్లి గిట్టడమెందుకు । నరకయాతనలో బడడము యెందుకు ॥గు॥ 8. అవనిలో మధిపల్లి నివాసుడు । అవధూత నిర్మలానందుడు । ఆత్మానాత్మ విచారము చేత గురుబోధచే తరియించుము జీవా ॥గు॥

## 125. తత్వం—సింధుమండలి రాగం—ఆది

1. యవ్వన పద్మము శ్రీహరికి అర్పించినవాడే గురుపుత్రుడు యవ్వనములో విషయానందములో మునిగినవాడే భ్రష్టుడు ॥య॥ 2. శమము దమము దయ శాంతము గల్గినవాడే గురుపుత్రుడు। ముముక్షువులతో సాధువులతో పోట్లాడిన వాడే భ్రష్టుడు ॥య॥ 3. మతము కులము సర్వము మిధ్యయని యెరిగిన వాడే గురు పుత్రుడు। సతతము భ్రూమధ్యమందున జూడనివాడే భ్రష్టుడు ॥య॥ 4. జ్ఞానము ద్వార బ్రాహ్మీస్థితిలో ప్రవేశించినవాడే గురుపుత్రుడు। ధ్యానము జేయక ధనమున్నదని గర్వపడువాడే భ్రష్టుడు ॥య॥ 5. అవధూత నిర్మలానందుని బోధ మర్మమెరిగిన వాడే గురు పుత్రుడు। అవివేకముతో యోగము యెరుగక వదిరేటి వాడే భ్రష్టుడు ॥య॥

## 126. తత్వం—సుదర్శన రాగం—ఏక

1. రోగీ ఓ రోగీ నీ జన్మరోగముకు మందువాడుకో ॥రో॥ నీ భార్యెవరు నీ వారెవరు। సంసారంబిది చాల విచిత్రము। ఆరోగ్యంబుగ వున్నానాడె గురు పంచన జేరిన ధ్యానము గుదురును ॥రో॥ 2. బాల్య ప్రాయమున ఆటలాడితివి। యవ్వన మందున భామల గూడితివి। వార్ధక్యంబున చింతలో బడితివి। సత్సంగత్వముచేయక జెడితివి ॥రో॥ 3. పండ్రుకలన్నియు నెరసిపోవును। దంతములన్నియు వూడిపోవును। ముడ్డి వంకరగ వంగిపోవును। కాళ్ళు చేతులు ఆడకుండును ॥రో॥ 4. ప్రాణాయామం ప్రత్యాహారం। మౌనమందు ధ్యాన సమాధి విధానం। ఓ నరుడా యెరిగె విధానం। గురుదేవుని వాక్యమె మూలం ॥రో॥ 5. అవనిలో ముధక్ పల్లి నివాసుడు। అవధూత నిర్మలానందుడు। అంర్య కాలములో ఆ బయలందున। తను తానై పోవలయనె జీవ్ఞా ॥రో॥

## 127. తత్వం-కనకమాలిక రాగం—జంపె

1. లేదు లేదు సుమి। ఇందున ముక్తి। లేనేలేదు సుమి ॥ఇం॥ దేవళమందు నివసించినను। వృక్షము క్రింద జీవించినను ॥లే॥ 2. అన్నిటినీ విడనాడినను। జింక చర్మము ధరియించినను। జడలు శికలు వేసినగాని। తలను బోడిగ జేసినగాని ॥లే॥ 3. రంగు గుడ్డలు వేసినగాని। ఎన్ని వేషములు వేసినగాని। బిక్షమెత్తు కొనుచు తిరిగినగాని। యాత్రలెన్నియు చేసినగాని ॥లే॥ 4. ఆత్మానాత్మ విచారము చేతనె। అవధూత నిర్మలానందుడనె। అన్ని మతములకు జ్ఞానముతోనె। ముక్తి లభించును యుక్తి చేతనె ॥లే॥

## 128. తత్వం—నాగాభరణ రాగం—ఆది

1. ధ్యానము జేయుము ధ్యానము శ్రేయము । మదిలో గురు ధ్యానము విడకుము । ఓం నమః శివాయ యనుము । గురు సాక్షాత్ పరబ్రహ్మంబనుము ॥ధ్యా॥ 2. లౌకిక విద్యలో "కోటి - మార్కులు దెచ్చినను తృప్తి గలుగ జాలదు । శ్రీకేశ్వరుని యేకాంతములో ధ్యానము జేసిన తృప్తి గలదు । లౌకిక విద్య ఆహారమునకే ఆధ్యాత్మిక ఆహారము నొసగదు ॥ధ్యా॥ 3. మర్కటంబువలె పట్టువిడువక గురుగుట్టులో నీ వుండు పుత్రకా । మార్జాలమువలె మన గురు దేవుడు కాపాడును సుమి కరుణామయుడు ॥ధ్యా॥ 4. లోకములో వ్యాధులు, బాధలు, వ్యాకులతలు, అభిమానము, చింతలు । లోకమంతయు శోకవనంబే ఈ మహోదధిని దాటు క్షణంబె ॥ధ్యా॥ 5. మాయ సరోవరంబీ సంసారము కాయము గాదిది మాయకాయము । న్యాయమార్గమును బోధజేసెను అవధూత నిర్మలానందుడు ॥ధ్యా॥

## 129. తత్వం—భూరి కళ్యాణి రాగం-ఆట

1. ఐహిక భోగము అశాశ్వితం । ఆశాపాశము అచ్ఛేద్యం । ఐనా ఆశాపాశం ఛేదించు అభ్యాస వైరాగ్యము పెంచు ॥ఐ॥ 2. కాలము నృత్యము చేయుచున్నది । చక్రములాగ తిరుగుచున్నది । జీవిత నావ నడుచుచున్నది । త్రోవదప్పి యెటో బోవుచున్నది ॥ఐ॥ 3. యువ్వన పద్మము శీఘ్రమె వాడును । అవయవంబులు పట్టుదప్పును । పైకి ప్రాక యత్నించి వలయును । కాలము క్షణములో పూడ్చివేయును ॥ఐ॥ 4. విత్తంబున్నచో వత్తురు అందరు । విత్తంబోడిసిన రారురాబందులు । చిత్తము నిల్పుము తత్వము దెల్పుము । నిత్యానందములో తామునిగి ॥ఐ॥ 5. అవధూత నిర్మలానందుడు । ఆత్మానాత్మ విచారము ద్వార । అజప ధ్యానాభ్యాసము చేతను । అచలుడై పరిపూర్ణం బగుము ॥ఐ॥

## 130. తత్వం—బీమ్‌ప్లాస్ రాగం—ఏక

1. పరిశోధించుము జీవా—తత్వములు ॥ప॥ నిరతము దీనిని అభ్యసించినా । పరతత్వమునకు మార్గంబగుపడు ॥ప॥ 2. ఆధారంబులో భూతత్వంబు । కెపిరుచుండు పసుపు వర్ణంబు ॥ప॥ 3. లింగస్థానమున జలతత్వంబు । వగరు రుచుండు తెలుపు వర్ణంబు ॥ప॥ 4. బొడ్డు స్థానంబులో అగ్ని తత్వంబు ।

కారమురుచుండు ఎరుపు వర్ణంబు ॥ప॥ 5. హృదయ స్థానమున వాయు తత్వంబు । పుల్లని రుచుంతు ధూమ్ర వర్ణంబు ॥ప॥ 6. కంఠమందు ఆకాశ తత్వంబు । రుచి లవణంబు నీల వర్ణంబు ॥ప॥ 7. అవని ముదక్పల్లి నివాసుడు । అవధూత నిర్మలానందుడు దెలిపెను ॥ప॥

## 131. తత్వం—దేవగాంధారి రాగం—ఆది

1. వెతుకుము వెతుకుము జీవా । నీలో । జీవగుణంబుల వుతుకుము వుతుకుము జీవా ॥వె॥ వుత్తకర్త వుత్తకర్త జీవా ॥వె॥ 2. గురుచరణంబులు పట్టినప్పుడు గదా పరమార్థసారంబు దెలియుటకు । గురు ఆజ్ఞానుసారము నడిచినప్పుడు గదా । గురుకీలు తన వశమవ్వుటకు ॥వె॥ 3. భక్తిసారము గన్నపుడు గదా । ముక్తిమార్గము వెతుకుటకు । శక్తి గలిగి నీ యుక్తి యుంటె గదా । ముక్తి మార్గము గోచరించుటకు ॥వె॥ 4. వైరాగ్యఖడ్గము చేపట్టిన గదా । జారుల్ కామక్రోధాదుల్ భయపట్టుటకు ఆత్మానాత్మ విచారము చేసినపుడుగదా । సర్వము మిథ్యయని బోధపడుటకు ॥వె॥ 5. సాధన సంపత్తికి అధికారై తెగదా । సాధుల మర్మము బోధపడుటకు । మూలచక్ర రహస్యంబెరిగితె గదా । పాలభాగము దాటుటకు ॥వె॥ 6. కంటిలోన మర్మం బెరిగితె గదా । ఒంటి స్తంభము ప్రాకుటకు । అజప గాయత్రి అర్థమెరిగితె గదా । అజప ధ్యానంబు కుదురుటకు । అవనిలో ముదక్పల్లి జేరినగదా । అవధూత నిర్మలానందుని జేరుటకు ॥వె॥

## 132. తత్వం—కోకిల ప్రియ రాగం—ఆట

1. యే మతమును దూషించకుము । నీ మతమేదో విడువకుము । రామ శివ, అల్లా యన్నను । ప్రభుయన్నను అన్ని దైవనామములే ॥యే॥ 2. గంగ గోదావరి తుంగభద్రలు । కావేరి నర్మద నదులు । అలాగే యిల యెన్నో మతములు । అంతమందున గమ్యమొక్కటే ॥యే॥ 3. ఆకాశముపై వుమ్మివేసిన । అది మనపైరే బహువిధము లోకములో యే మతమును దిట్టకు । గిట్టకున్నను ప్రక్కకు తప్పుకో ॥యే॥ 4. విశ్వములో మహ విశ్వమానవతము స్థాపించబడియె దానిలోజేరుకో । విశ్వసించి అవధూత నిర్మలానందుని మర్మము దెలిసి నడచుకో ॥యే॥

## 133. తత్వం—గుణప్రియ రాగం—జుల్వ

1. ఏమనుకున్నవు యేమనుకున్నవు । ఓ జీవుడా (నీయవ్వ) ॥ఏ॥ ఏమనుకున్నవు గురుబోధంటే । నామ రూపములులేనిది మరుగు ॥ఏ॥ 2. ఆరో మేడలో ఆడదున్నది । ఆడది నిన్ను అములుకున్నది । ఆడికి ఈడికి త్రిప్పు చున్నది । అంతమందు నిన్నేమి జేస్తదో ॥ఏ॥ 3. పడిగెలేని ఒక పాము వున్నది । పామునెత్తిలో రత్నమున్నది । పాము తోకపై తన్నుమన్నది పసందుగ తానాడతన్నది ॥ఏ॥ 4. తొమ్మిది తొఱ్ఱల చెట్టు వున్నది । చెట్టు లోపల చిలుక వున్నది । చిలుక ముక్కులో లింగమున్నది । గుట్టుదెలిసితె బయలై యున్నది ॥ఏ॥ 5. ఐదురంగుల చక్రములున్నవి।అటుఇటు అవి తిరుగు చున్నవి । ఐదురంగులలో అంటక । అవధూత నిర్మలానందుడు వున్నాడు ॥ఏ॥

## 134. తత్వం—వనస్పతి రాగం—ఆట

1. చూడుమి చూడిమి చూడుమిరా।కనుబొమ్మల మధ్యలో గూడుమిరా।వేడుమి వేడుమి వేడుమిరా । గురుదేవుని జాడలో వేడుమిరా ॥చూ॥ 2. వెండ్లవలె చెట్టుకు పండ్లు వున్నవి।పండ్లు వెయ్యయి వెలుగుచున్నవి।గుండ్లమధ్యలో బండ యున్నది బండ దీసితె బాట వున్నది ॥చూ॥3. చూడ చూడగ వెన్నెల బుట్టును వెన్నెలలో అచిన్నది ఆడును।నాతిపైన ఒక కోతి వున్నది కోతి మూతులు త్రిప్పుచున్నది॥చూ॥ 4. కోతి నెత్తిపై జ్యోతి యున్నది—జ్యోతియే సర్వము తానై యున్నది—జ్యోతిపతి అవధూత నిర్మలా నందుడు—బట్ట బయలై వుండేను ॥ చూ॥

## 135. తత్వం—చారుకేసి రాగం—ఆట

1. మొక్కుము మొక్కుము మొక్కుముర్రా।గురుచరణంబులకె మొక్కుమురా । యెక్కుము యెక్కుము యెక్కుముర్రా । షట్ చక్రముల పొంట యెక్కుమురా॥మొ॥ 2. బొట్టు బెట్టుకో యితర వేప్పులను।పలలోనైనను స్మరణ జేయుము। బొట్టు బెట్టుకో గురుమూర్తి కృపచే । బొట్టులోన కనిపెట్టి చూచుకొని ॥మొ॥ 3. యెవ్వరు జెప్పిన యెవరు కాదన్నను । యేకాంతములో స్మరణ మరువకుము। భువిలో వేశధారుల గొలచిన । భవ బంధములను త్రెంచుకొనలేవు ॥మొ॥ 4. భిక్షమెత్తుకొనుచు లుచ్చలు వచ్చియు । కుక్షికొరకు తంత్రములను జూపెరు । లక్షణముగా బ్రహ్మ విద్యను నేర్పెటి । కారణచార్యునే భజించుమురా ॥మొ॥ 5. మాటలు పాటలు నేర్చిన బూటకి । జడధారుల నమ్మిన ఫలమేమిరా । వాటముగ అవధూత నిర్మలానందుని తారక సాధన మెరుగుమురా ॥మొ॥

## 136. తత్వం—ఖండె రాగం—ఆది

1. చక్కనైన దర్పణముపై ముక్కులోన అడెటి । శ్వాసనూదుము నిక్కముగను శ్రద్ధగల ఓ భక్తుడా ॥చ॥ 2. నాలుగుమూలల ఆకారం కనిపించిన దెల్యురా । మేలుగ ఆ భూతత్వం కీలు దెల్యురా శిష్యుడా ॥చ॥ 3. అర్ధచంద్రా కారము ఆ అద్దముపై జూచిన । అది జలతత్వంబని దృఢము జేసుకోమనుసుమా ॥చ॥ 4. త్రికోనరూపము నీవు తిలకించుము శిష్యుడా । ఆ అకారమే అగ్ని తత్వము భక్తుడా ॥చ॥ 5. లంబకోణ రూపము సంబరంబుగా ముందుగ । వాయు తత్వంబని యెరుగుము నిక్కముగ ఓ భక్తుడా ॥చ॥ 6. చుక్క చుక్కలు కనిపించిన ఆకాశతత్వము । చక్కని అవధూత నిర్మలానందుని బోధెరుగుమురా ॥చ॥

## 137. తత్వం—మంగళకైశిక రాగం—ఏక

1. షణ్ముఖి ముద్రలో దెలుసుకొనుమురా । షట్చక్రముల మర్మ మెరిగియు । మున్ముందుగ భ్రూమధ్యము జూడగ । ముదముగ రంగులు గని పించునురా ॥ష॥ 2. పసుపు రంగు గనిపించిన అచ్చట । పృథివి తత్వంబని యెరుగుమురా । నాసటి లోపల పరికించుమురా । తెలుపు రంగైన జలతత్వంబు ॥ష॥ 3. తొల్లిలు తొమ్మిదిగల మేన్మట్టిలో । గుట్టుంబుల మరి తెలియుమురా । ఎఱ్ఱగ గనిపించిన నీ కచట । అగ్ని తత్వమని యెరుగుమురా ॥ష॥ 4. బుర్ర లోన మేఘమువలె నల్లగ । ఆకు పచ్చగ గనిపించును । కుఱ్ఱవాడ అది వాయు తత్వమని । కూర్చుని అభ్యాసము పెంపొందించు ॥ష॥ 5. చుక్క చుక్కలు రంగురంగులు । ఆకాశ తత్వంబినుమురా । చక్కనైన అవధూత నిర్మలా । నందుని తత్వం బెరుగుమురా ॥ష॥

## 138. తత్వం—మారువరాగం—రూపక లేక జుల్వ తాళం

1. చంద్రనాడిలో సూర్యనాడి । సూర్యనాడిలో చంద్రనాడి । చంద్ర నాడిలో పృథివి తత్వము । మొట్ట మొదట వుండునండి ॥చం॥ 2. అట్లాగె కుడి నాడిలో మొట్ట మొదట । ఆకాశతత్వముండు । కుడిలోన పృథివితత్వ। మాడిన సూర్యలో చంద్ర ॥చం॥ 3. యెడుమ స్వరములోన ఆకాశతత్వముండిన । యెడుమలో సూర్యనాడి । ఆడుచున్నదని తెల్యుడు ॥చం॥ 4. ఆధార చక్రములో హంస యెపుడు వచ్చునో । అంతకు ముందుతత్వం । బరచిన మేలు కలదు ॥చం॥ 5. మధక్పల్లిలో వెలసి బుధులకు యీ బోధజేసె। సదుమల మంత్రా నందము అవధూత నిర్మలానందుడు దెలుపు ॥చం॥

## 139. తత్వం—గౌళి రాగం—ఆది

1. సన్నని చీపురు పుడుకకు యేకిన । దూది మెల్లగనుంచ వలెన్ ।
సన్నగ వచ్చేటి శ్వాస దగ్గర పుడం వుంచియు చూడవలెన్ ॥స॥ 2. పదహారం
గుళములు వుండిన పృథివి తత్వమని యెరుగవలెన్ । పదిలంబుగ సదుమల
మంత్రంబులో యీ మర్మము తిలకించవలెన్ ॥స॥ 3. పన్నెండు అంగుళములు
వుండిన । జలతత్వంబని దృఢపరచు । అన్నిటిలోపల మిశ్రమముండును ।
ఆదికాస్త నీవెరుగ వలెన్ ॥స॥ 4. ఎనిమిదంగుళముల్ దూది । క్రిందికి వచ్చిన
వాయుతత్వంబున్ । కనుమునాలుగు అంగుళాలుండిన । అగ్నితత్వమని నిశ్చ
యించుకో ॥స॥ 5. ఆకాశతత్వం అనుభవముచే । పరిశోధనచే తెల్పవలెన్ ।
అవధూత నిర్మలానందుని తత్వ రహస్యంబెరుగ వలెన్ ॥స॥

## 140. తత్వం సైంధవి రాగం—ఏక

1. దాసులందరు తమాష జూడగ ఖేచరి వేషమువేసె గదా ।
ఖేచరి వేషము వేసినందుకు । నాసికమెక్కి ఆడెగదా ॥దా॥ 2. రెండు
పాములు విడివిడి గుండెను । రెంటిని ఒకటి జేసె గదా । రెండు ఒకటి అయ్యి
నప్పుడు । సుడి గుండములో బడి పోయె గదా ॥దా॥ 3. ఏ చక్రము బంధించి
నన్నను । యింత యందము లేదుగదా ఖేచరియోగము యెరిగిన యోగికి ।
సాధనతో పనిలేదు గదా ॥దా॥ 4. ఏడు చక్రములు యెండిపోవును । గూడులో
మర్మంబెరుగు గదా—జోడు శ్వాసలకు మలిసుట్టొక్కటై చూడగ చూడగ తెలిసె
గదా ॥దా॥ 5. ముధక్‌పల్లి అవధూత నిర్మలానందుడు బోధ తెలిపెగదా—
చదువగ చదువగ చదువు అందక—సామీప్య పదమొందెగదా ॥దా॥

## 141. తత్వం—సామంత రాగం—ఏక

1. సాధకుడైనను బోధకుడైనను—మౌనముగ ధ్యానములోనుండెనా—సాధన
హీనుడు,పిచ్చివాడుయని మూగవాడుయని జనులు బల్కెదరు॥సా॥2.ధర్మమార్గము
బోధజేసినా—వధురుబోతని వాదనజేతురు—కర్మగాలి పూరిలో వుండెనా—యోగి
పూరిలో వుండునా యందురు ॥సా॥ 3. అడవిలో చున్నగుహలో వున్నను—
జనులకు భయపడె వీరికి వాడందురు జడయక బ్రహ్మచర్యము చేసిన బాధనె—చేయ
కున్నను యిలలో బాధనె ॥సా॥ 4. బొట్టు బెట్టుకున్నను యిల బాధనె పెట్టినను మరి
యెంతో బాధ—ఇట్టిమాటలు లక్ష్యపెట్టక—అవధూత నిర్మలానందుని జేరుము ॥సా॥

## 142. తత్వం—ద్విజావంతి రాగం—త్రిపుట

1. సోహం సోహంబంటె చాలదు । సోహం రహస్యార్థంబెరుగ వలెన్ సోహం రహస్యార్థంబెరుగాలంటె । మోహ గుణంబుల విడువ వలెన్ ॥సో॥ 2 సో యనగ నేప్పుడు హం అనగ జీవుడు । కాయములో పరంజ్యోతిని యెరిగి । న్యాయ మార్గమున నడిచేటందుకు ॥సో॥ 3. ఆధారఉద్యాణ జాలంధర బంధనము లను యెరుగ వలెన్ । సాధనజేయుము ఖేచరితోడుత సాధులతో సత్సంగము జేసి ॥ సో ॥ 4. ముధక్‌పల్లిలో ముద్దుల గురుడు అవధూత నిర్మలానందుడు ముదమగ ధ్యానాభ్యాసము జేసియు మేరి పర్వతము నధిరోహించెను ॥ సో ॥

## 143. తత్వం—కురంజి రాగం—ఏక—ఆది

1. గుర్తున్నదా । నీకు । గుర్తులేదా । (ఓరోరి భడవ) యెరుకున్నదా । నీకు । యెరుకలేదా ॥ గు ॥ కరములు మోడ్చి నరకకూపమని । మురిసె గర్భ ములో యేడ్చిన సంగతి ॥గు॥ 2. నిరతముగ హరినామ స్మరణ । జేసెదనని బాసజేస్తివి । ధరణి లోపల బుట్టి పిదప । పరి పరి విధముల పరగిడు చుంటివి ॥ గు ॥ 3. యోగ రహస్యం బెరుగ లేకను । భోగకాంక్షను విడువనైతివి । రాగ ద్వేషము రాలగొట్టక । స్థిరముగానిది స్థిరమను కొంటివి ॥ గు ॥ 4. యెన్ని శ్వాసలు నీవు విడుతువో । అన్ని సాధనలు గలవు లోకములో అన్ని మార్గములు బట్టబయలుకే । చిన్న మాట ఈ రహస్యం బెరుగుము ॥ గు ॥ 5. అజప ధ్యానా దుల చేతను । అవధూతనిర్మలానందుడు । తపమొనర్చి ప్రాణముతో । బయలు లోతా బయలు గమ్మనె మాట ॥గు॥

## 144. తత్వం—నవరోజు రాగం—ఆది

1. దేశము బోదము వస్తారమ్మా? । ఉప । దేశము బోదము వస్తారమ్మా ॥దే॥ దేశములనుజేరి దాసులకు దాసులమై । నాసికంబున హృదయ పద్మంబులో ధ్యానముచే ॥దే॥ 2. ఆది గణపతి పురోయమ్మ । గణ । నాథుని కరుణచేత పోయెదనమ్మ । బాధలాపైనను తారక సాధనచే । ఆ దారి విడువక ముందుకు పోవమ్మా ॥దే॥ 3. రెండో దేశము దాటుమమ్మ । మూడో । దేశమున బ్రహ్మ బుట్టిన చోటోయమ్మ । దండిగ నాల్గొదేశమున వటపత్రముపై । వుండెను విష్ణువు దాటుమమ్మ ॥దే॥ 4. ఐదో దేశము జూడుమమ్మ । అందు । శివుడు పార్వతితో నాట్యంబాడునమ్మ । ఐదో దేశముదాట అంతట జీవుడు । ఐదు కళల

తోడ తానుండు నమ్మ ॥దే॥ 5. యేడో దేశమున గురుమూర్తి । వెయ్యి । కళం కుర్చీపైన కూర్చున్నదమ్మ ... అవధూత నిర్మలానందుని నీవు । దానిపై దాన్ని దాటి తానుండెనమ్మ ॥దే॥

### 145. తత్వం—(గమ్యేము స్తకిక్ అనుమాదిరి)

1. ఆరు మూడు మూసి-ఆద్వారము వెరసి-మనసు కలసి గురువు పూజ జేతము । తనువు మరసి ॥ఆ॥ 2. అది పాత్రను తను పైకెదీసి పంచామృతముల వొక్కటి జేసి అంతటాను నింపి । పావాల పైవోసి-అంచరు గని ॥గు॥ ముప్పైమూడు పుల్లదారం దెచ్చి—దెప్ప రెండువేల పూలు దెచ్చి—అందు మూడె నచ్చి। తుదకు వొకటె గుచ్చిన మాలవేసి ॥గు॥ 3. హృదయమందు-దె జ్యోతిని లేపి । భ్రూమధ్యములో దెచ్చియుంచి । గురుకు ఆరతి నరిపి । ... నాదల్ గలిపిన భజన జేసి ॥గు॥ 4. మూడు రంగుల తాంబూలం బట్టి । అష్ట విధముల పండ్లానుబెట్టి అచ్చట బొట్టు బెట్టి । అక్షంతలు బట్టి గురుపై వేసి ॥గు॥ 5. ముధక్‌పల్లి నివాస మందరు । బాల అవధూత నిర్మలానందు తనను మరిచి సందు । లోన లయముజెందు । మర్మము తెలసి ॥గు॥

### 146. తత్వం—యాగప్రియ రాగం—ఆది

1. మంగళం గురుడా మంగళం గురుడా । అంగమందున లింగమైన వో గురుడా ॥మం॥ 2. నేను నీవాయె నీవు నేనాయె । నేను నీవు లేకుంటేమి లేదాయె ॥మం॥ 3. నాదం నీవాయె మోదం నీవాయె । నాదము మోదము మరచితేమి లేదాయె ॥మం॥ 4. భక్తి నీవాయె శక్తి నీవాయె । భక్తి శక్తి లేకుంటేమి లేదాయె ॥మం॥ 5. యెరుక నీవాయె మరుపు నీవాయె । యెరుక మరుపు లేకుంటేమి లేదాయె ॥మం॥ 6. అన్ని నీవాయె సున్న నీవాయె । అన్ని సున్నైపోతే శూన్యంబె మిగిలె ॥మం॥ 7. నేను లేనాయె నీవులేవాయె ।అపుడు। అవధూత నిర్మలుడు పరిపూర్ణుడాయె ॥మం॥

# శ్రీ స్వామిమాత సంవాద
## కందార్ధదర్వులు

ప్రశ్న కం: గురువర కరుణించియునా
కరువును దీర్చంగ నీవె! కాపాడుమయా
మరువక నిరతము మనసున
మరి మరి దల్చేటిదాన ॥దర్వు॥ మానక తండ్రీ । మౌనము
దాల్చుటేలను తండ్రి । దీనురాలను వస్త్రి బాట జూపెదరనుచు ।
ఆనిజబోధకై నీ పాదాలిడువనూ ॥మా॥

జవాబు కం: ఎందుకు నా వద్దకు యా
నందంబుగ వచ్చినావొ నాతో నీవున్
ముందుగ యెరిగించుజనని
తొందరపడబోక నీవు ॥ధర్వు॥ తొల్లిగ తల్లి । కల్లలు
మాని । రాముందు తల్లీ! యుల్లమందున మాట యెరిగించు
మిక్కడ। చల్లగ దెల్పితె చాల సంతోషంబు ॥తొ॥

ప్రశ్న కం: దేవుని కనుగొన వలెనని
భావములో కోర్కెగల్గి । భక్తి చెయిపుడున్
నీ వద్ద నిల్చి యుంటిని
దేవా! నను గావు తండ్రి ॥దర్వు॥ డెక్కని యంటిన్ ।
దీనులారయనుచునేనుంటిన్ । మక్కువ తోడ వో చక్క
నయ్యనాకు । ఇక్కడ దేవుని రహస్యంబు దెలుపుము ॥ది॥

జవాబు కం: దేవుని కనుగొనె ముందుగ
భావంబులొ చలన ముడిగి । బాగుగనీవున్
రావమ్మ మనసు నిల్పియు ॥ నీవను దేవున్ని జూడ
॥దర్వు॥ నిందెల కోర్చి నేనను మాట ముందుగ
నేర్చి । సందేహములు బాసి మందిరంబులో మర్చి
బందంబు దొలిగిన ఆనంద పదమందు ॥నిం॥

ప్రశ్న కం: మనసును యెట్టుల నిల్పుదు
వినజేయుము తండ్రి మాకు । వేగమె దయతో
మనసుకు పగ్గము వేయుట
కనిపించదు మాకు యేమి ॥ధర్వ॥ కారణమేమో ।।
కరుణించియు । ప్రభుదెల్పు మాతో । ధారుణియందున మీ
సాటి లేరనుచు । దగ్గర జేరితి దయతో దీవించియు ॥కార॥

జవాబు కం: సాధన చేతను మనసును
మోదముతో నిలుపుమమ్మ । ముందుగ నీవున్
సాధన గట్టిగ చేసిన
సాధింతువు సకల పనుల ॥ధర్వ॥ శాంతము తోడన్।
చింతల విడచి చక్కగ గనుమున్ । ఇంతైన చలనంబు
లేకుండ అయోదాక । యెంతెంతొ అభ్యాస పరురాల
వైయుండి ॥శాం॥

ప్రశ్న కం: సాధన యనగను నేమిటి
మీ దయతో దెల్పుమయ్య । మీదాసుతకున్
భోదించు వివరమేమిటొ
భేదము లేకుండ యెంతొ ॥ధర్వ॥ బిడ్డకు దేవా ।
ప్రేమతో ఇప్పుడు మహానుభావ । దొడ్డ వాడవు నీవు
ఆదారించియు ౹బోవ ౹గుడ్డివాళ్ళము మేము జూపించు ఆ త్రోవ॥బి॥

జవాబు కం: ఆదారం బునులాగియు
సాధించు మహసంతోని । చక్రములందున్
బేదము లేక సోహం
మోదముతో ముక్కుయందు ॥ధర్వ॥ ముందుగ మాతా
సందేహంబు విడిచదువు మాత । అంతంబుగ నీవు శ్వాసల
మార్చుచు కుంబకామందున ప్రాణిని బిగబట్టి ॥ముం॥

ప్రశ్న కం: ఆటింటిలో మదినిల్పక
కోతుగ చిత్రములు యెన్నొ జూచితి తండ్రీ
ఈ రూపములన్ని మదికి

సారము లేదని తెలిసెను ॥ధర్మ॥ చక్కగ మదికిన్ ద్రుక్కు
నిల్పి జూచె నా మదియున్ । మక్కువ లోడు తలో చూపు
వలన యీ తిక్కు జూచెను గాన యెరుకాని తోచెను ॥చ॥

జవాబు కం: కీలెరిగియు మేలొందుము
గాలిని బంధించి చాల । గట్టిగ నీవున్
గాలి నిలిచిపోయిన ఆ
మూలంమైన మనసు నిలచు ॥ధర్మ॥ ముదముగ మూలం
పదిలంబుగ దెలిసితె లాభం । మది ప్రాణములు రెండు
యేకమై యుండెను. అదుపులో బెట్టుము యేదైన వొకదాన్ని ॥ము॥

ప్రశ్న కం: గాలెట్టుల కట్టుబడును
కీలెక్కడ గలదొ మాకు కొంచములోనన్
మేలుగ బోదించు గురుడ
చాలగ తాపంబు నాయె ॥ధర్మ॥ సంతోషముతో చింతను
దీర్చి ఇంతలో మాతొ కొంతైన దాచక నిజబోద
దెల్పుము మంతనంబున నమ్మి మరి గొల్చెదాసను ॥సం॥

జవాబు: కం: జనని రొదెల్పెద మనమున
అనుమానము విడచిలెస్స ఆనందమున్
కనుమా నీవను మాటకు
వినజేతును తెల్పినంత ॥ధర్మ॥ వినుమా తల్లి కన్నుగొని
మరువుత్రది మల్లి అనుమానమ్మునుదాయ నాలుక పై
కొత్తి కనుల మలిపి నిలిపి నవరంధ్రమ్ముల మూసి ॥వి॥

ప్రశ్న: కం: కొద్దిగ నా మది నిలుచెను
శుద్దిగ యింకేమి గలదు చూపుల బయటన్
వద్దన్నను మిమ్మిడువను
ముద్దుగ నా పాలి దేవ ॥ధర్మ॥ ముందుగా దెల్పు సందేహంబు దీర్చైనా వేల్పు । మంచిరహంబులొ కొత్తబందం
బుదొలగెను । యెందెందు వెత్తికిన మీ సరికనరాదు ॥మం॥

జవాబు: కం: కనుబొమల నడుమ చూపును
వినుమెల్లగ దెచ్చి నిలిపి వేగామే నీవున్
తనువున ఈ ఆటంతయు
తను జూడగ తనచే మరచి ॥ధర్వు॥ తనువుంచునమ్మ।
తను మరచిన యెరుకలేదమ్మ। ఘనముగ గాలిలేని
దీపము విధమ ।అనుమానముల విడచి మేరు శిఖరము లోను॥తను॥

ప్రశ్న: కం: ఎక్కడి నుంచియు వచ్చియు
ఎక్కడికొయేదనునేను। యెరుగింపుమయా
నిక్కముగ తనువు విడచిన
చక్కని యీ మరుగు దెలుపు ॥ధర్వు॥ స్వామి దెలుపు
డున్। శరణంటిని యెటు బోవ మాకున్। ఈ మాటకు
బదులు దయచేసి దెలుపుము నా మదిలో సంశయంబు
మానకుండెను ॥స్వా॥

జవాబు: కం: జ్యోతి యెతా విచ్చును మరు
జ్యోతికి యీ మరుగుగనుము। సౌద్యము దప్ప
ఖ్యాతిగ ఆలోసించిన
జ్యోతియు ఆ వెలుగు వల్ల ॥ధర్వు॥ జూమ్పు శరీరం। వచ్చిన
తావులేనిదే మూలం। స్వచ్ఛముగా బయలంను లయమొందద
కున్నాను। ఇచ్చలు చావక భవ బంధములో జిక్కి ॥జో॥

ప్రశ్న: కం: జనకా! యీసృష్టెట్టుల
జనియించెనో దెలుపుమయ్య। చాలగ యిపుడున్
జనన మరణంబుల మరుగు
తనయులకు భిన్నజేయు తండ్రి ॥ధర్వు॥ తప్పకనయ్యా,
దొప్పగా మీకు మ్రొక్కెదనయ్య। తప్పులున్న గాని తన
యులను మన్నించి। ఇప్పుడే యీ బోధయింపు తోడను మాకు ॥త॥

జవాబు: కం: నామము రూపము నేమము
ఏమాత్రము లేక వుండె దేదియుగలదో
ఓ మాత దాని తోటిచి
ఈమాయ అఖిల మేరుకయు ॥ధర్వ॥ ఇక్కడబుట్టెన్।
ఈ మెరుక బట్టిన సృష్టి బుట్టెన్। ఈ యెరుక మరుపెమన
మరణంబు అనుకొమ్మ ఈ యెరుక బుట్టిన కాలంబె జనంబు ॥ఇ॥

ప్రశ్న: కం: కొందరు మూగగ బుట్టుట
కొందరు వంకర చెవిటిగ। కుంటిగ బుట్టి
ముందటి కర్మంబనిమా
కెందరొవచి యింతురయ్యా ॥ధర్వ॥ యేదియు నిజమున్
ఇందరికర్మం బెక్కడ బుట్టెన్। సందేహమును బాపు ఇందరి
వ్రాతను।
యెందుండి వ్రాసెను వాడెవ్వడొ దెల్పు ॥యే॥

జవాబు: కం: తలిదండ్రులు కలిసినప్పుడె
కలిమాయను రతిలోముద్ర। కలిగెను తల్లీ
తెలుసుకొ ఇంతకు తొల్లిగ
తల తలమని వచ్చెనాడె ॥ధర్వ॥ వ్రాతని యెంచు ధాత
హం సోహంబని యెంచు। ఖ్యాతిగ యోశించు కుక్షి సము
ద్రములొ తామరాదామపై అంతట దిరుగుటే ॥వ్రా॥

ప్రశ్న: కం: ఈ మానవులలొ కొందరు
మామతమే గొప్పనిబహలు। మాటలు నేర్చి
స్వామిరొ తర్కంబుకు దిగి
తేమీయు దెల్పంగ వలయు ॥ధర్వ॥ యెరిగించుమికన్!
దీన్ని విప్పి దీవించు దయతో। ఇన్ని పీఠంబులు యెన్నెన్నొ
మతములు। అన్ని యెక్కడ బుట్టెదెనాన్ని నమ్మొదు ॥యె॥



జవాబు: కం: ఖ్యాతిగ నీతిని జెప్పిన
ధాతలు తన జాతి కొరకు, దయతో బోధన్
మాతా! తెలిపిరి కావున
భూతలమున వారిచేత ॥ధర్వు॥ బుట్టినె తల్లి ఇట్టి మత
గ్రంధములే తల్లి గుట్టు దెలుసు కొన్న గురువులందురు వాక్కు
గట్టిగ అనిజదివి గురి నిలుపు బయలందు ॥ఖ్యా॥

ప్రశ్న: కం: నీళ్ళనుపై పై బోయుచు
రాళ్ళకు పూజలు సల్పుచు, రక్షించుమనే
వాళ్ళకు మోక్షంబు గలదె
రాళ్ళెట్లుల మోక్షమిచ్చు ॥ధర్వు॥ రక్షించి దెలిపు,
మోక్షము బాట! చూపించే వేల్పు! రక్షకుడవనుచు వచ్చితి
మది నిల్పు! లక్షణంబుగ నీకు సేవ సల్పేటి దాన ॥రక్షి॥

జవాబు: కం: తానే బొమ్మనుచేసియు
తానే యంత్రంబు బెట్టి, తలవంచియిలన్
తానే మ్రొక్కుచు నుండెను
తానెంతటి వెట్టివాడొ ॥ధర్వు॥ తనకే దెల్యాదుగా,
తెలిసివుంటె తననె యెరుగునుగా, తననే యెరుగని
భోద తప్పక ముప్పనుచు, తనువును మరచియు తననే
తామరచిన ॥తా॥

ప్రశ్న: కం: ఎరుకకు మరుపుకు మధ్యన,
గురువర తెరయేది గలదు కొంపలో చూడన్,
ఎరుకెటుల మరుపు జెందును,
యెరుకెట్టుల జన్మమెత్తు ॥ధర్వు॥ యెరుగించుమయ్యా
సరగూన మాకు, మురయుచునయ్య, పరమ దయాలుడవు
భక్తవత్సలుడావు, పొరపాటు లేకుండ స్థిరపరిచె
మాయయ్య ॥యె॥

